


# వేదామృతము

## 12 వేదమంత్రాల వైజ్ఞానిక వ్యాఖ్య






సరళార్థ వివరణ కర్త

సుమ్నార్థి

(డా॥ కోడూరి సుబ్బారావు)



# వేదామృతము

(12 వేదమంత్రాల వైజ్ఞానికవ్యాఖ్య)

మంత్రకర్త:
సర్వవ్యాపక సర్వేశ్వరుడు

వ్యాఖ్య:

సుమార్థి
(డా.కోడూరి సుబ్బారావు)

సంపాదకుడు
వాచస్పతి డా॥ మట్టి కృష్ణారెడ్డి M.A; M.Ed,Ph.D,D.lit.

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

# వేదామృతం

గాయత్రీ గ్రంథమాల: 66
ప్రతులు : 1000
సర్వస్వామ్యములు : గ్రంథకర్తవి
సృష్టి సంవత్సరం : 1,97,29,49,121
విక్రమాబ్దము : 2076
కలియుగ సంవత్సరం: 5121
శ్రీ వికారి నామ సం॥ర పుష్యమాసం, మకర సంక్రాంతి, 15-1-2021

**మూల్యము : 60/-** (తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

1. **డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,**
హనుమాపురం(B.O.); (Via.)భువనగిరి-508116.
సెల్: 99089 94084.

2. **గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,** ఆర్యసమాజము,
12-10-586/6, మేడిబావి, సీతాఫలమండి,
సికింద్రాబాద్-500 061. సెల్: 98480 11073.

3. **డా॥ మట్టి కృష్ణారెడ్డి,** వేదధర్మ ప్రచార ట్రస్టు(రి.),
2-27,ఆర్య సమాజ మందిరం, బాదం కాంప్లెక్సు,
చైత్యనపురి క్రాస్ రోడ్,దిల్‌సుఖ్‌నగర్.
హైదరాబాద్-60. సెల్: 94412 00322.

4. **శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య,** షాప్ నెం.5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736-740, కంచరిబజార్, సికింద్రాబాద్,
ఫోన్: 040-6632 0300.

5. **శ్రీ బాశెట్టి సత్తయ్య,** జె-38, రాంగోపాల్‌పేట,
సికింద్రాబాద్-500003. సెల్ : 99485 39795.

6. **ఆర్యసమాజము,** కూచిపూడి, తెనాలి-522313. సెల్:08644-252789.

5. **ఆర్యసమాజ మందిరం,** మెయిన్‌రోడ్, రైల్వే ఫ్లైఓవర్ దగ్గర,
సీతాఫలమండి-500061, 040-27071816; 9133134156;
9246174018

# ప్రార్థన

ఋషిః : కశ్యపః
ఛన్దః : విరాట్ పఙ్క్తిః

దేవతా : పవమానః సోమః
స్వరః : పఞ్చమః

**యత్ర జ్యోతి రజస్రం యస్మిన్**
**లోకే స్వర్హితమ్,తస్మిన్ మాం**
**ధేహి పవమాన అమృతే లోకే అక్షిత,**
**ఇన్ద్రాయేన్దో పరిస్రవ ॥**

ఋ.9-113-7

ఓ పవమాన సోముడా! అందరిని పవిత్రపరచు సోముడా- సోమ పరమేశ్వరా! ఏ లోకమున **'జ్యోతిః'** ప్రకాశమే ప్రకాశం - జ్ఞానమే జ్ఞానం ఉండునో, ఎచట 'స్వః' - ఆనందమే ఆనందం ఉండునో అట్టి అమృత లోకానికి - నీ తృతీయధామానికి (ముక్తి ధామానికి) నన్ను చేర్చుము.

జీవాత్మనైన నేను కేవలం ఇంద్రుడనే - ఇంద్రియాధిపతినే అవియును నీవు నిర్మించి యిచ్చినవే కదా! కాని, నీవు దేవేంద్రుడవు, సమస్త ప్రాకృతిక దేవతలను సృజించినవాడవు. కనుక ఓ దేవా! ఆనందస్వరూప పరమేశ్వరా! నాయందు నీ ఆనందమును స్రవింపజేయుము.

- సుమ్నార్థి

# పుస్తక నేపథ్యం

ఈ పుస్తకాన్ని వ్యాససంపుటి అనవచ్చు. సుమారు 7 సంవత్సరాలుగా నేను మా ఆర్యసమాజము-సీతాఫలమండి ద్వారా ప్రతినెల ఒక కరపత్రం వ్రాసి పంపుతున్న విషయం మీలో చాలామందికి తెలుసు. వాటిలో కొన్నిటిని కలిపి 4 పుస్తకాలుగా మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ద్వారా ప్రచురించటం జరిగింది. అవి-1. ఈశావాస్యమిదం సర్వమ్, 2. పండుగల పరమార్థం. 3. దేవుడు-జీవుడు-ప్రకృతి 4. వేదార్థ విజ్ఞానం. ఇప్పుడు మరికొన్ని కరపత్రాలు కలిపి ఈ **'వేదామృతం'**

అయితే, అప్పుడు శ్రీరావికంటి దీన్‌దయాళుగారు (వారాసిగూడ) కరపత్రాలను, పుస్తకాలను, ముద్రించి ఇస్తూవుండేవారు. దురదృష్టవశాత్తు వారు ఆకస్మికంగా దివంగతులయ్యారు. దానికి తోడు నా ఆర్యోగం కూడా క్షీణిస్తున్నది. కంటిలో గ్లూకోమా కూడా వచ్చింది. అందుచే శ్రీవేదాచార్య డా॥మట్టి కృష్ణారెడ్డిగారి సాయం కోరాను. వారు వేదసాహిత్యప్రచురనలో తలమునకలుగా కార్యభారమున్నా నా పైనున్న అభిమానంతో ఈ పుస్తకం డి.టి.పి. చేయించి సంపాదకత్వం వహించి చక్కగా ప్రింటు చేయించి ఇస్తామన్నారు. వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు, శుభాకాంక్షలు.

రిటైర్డ్ మెకానికల్ ఇంజనీయరు, పం.గోపదేవశాస్త్రిగారి ప్రియశిష్యులు, వారివలె బ్రహ్మచారిగానే వుంటూ ధార్మిక, సామాజిక సేవలలో గడుపుచున్న శ్రీమాన్ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారు నేను కోరకముందే ముందుకువచ్చి దీని ముద్రణవ్యయాన్ని దానంగా యిచ్చారు. ఇంతేగాక, ఇక ముందు నేను వ్రాసే రచనలకు కూడా ఆర్థిక సాయం చేస్తామని కొండంత భరోసానిచ్చారు. వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు, కృతజ్ఞతలు.

వైదిక సేవలో మీ **సుమ్నార్థి,**

(డా. కోడూరి సుబ్బారావు)

# ముద్రణ ద్రవ్యదాత

## శ్రీ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారి సంక్షిప్త పరిచయము

శ్రీ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారు గుంటూరు జిల్లాంతర్గత తెనాలి పట్టణంలో క్రీ.శ.1943, జూన్‌లో జన్మించారు. వీరి తల్లిదండ్రులు స్వ॥ మానుకొండ వీరరాఘవమ్మ, స్వ॥ క్రిష్ణయ్య గార్లు.వీరు ధార్మికులు, శ్రమశీలులు, దానగుణములు గలిగిన, ఈ ఆదర్శ దంపతు వీరికి మొత్తం 11 మంది సంతానం. వారిలో మొదటగా వరుసగా 5 గురు ఆడపిల్లలు పుట్టారు. అందులో చివరి ఇరువురు బాల్యమునందే మరణించిన తరుపరి 6వ సంతానంగా శ్రీ మానుకొండ రాధాకృష్ణ మూర్తి గారు జన్మించిరి. వీరి తరువాత ఇద్దరు మొగపిల్లలు కలుగగా అందులో ఒకరు బాల్యములోనే మరణించిరి. అనంతరము ఒక ఆడపిల్ల, మరి ఇద్దరు మొగపిల్లలు కలిగిరి. దురదృష్టవసాత్తు తండ్రి క్రిష్ణయ్యగారు తమ 57 సం॥ వయస్సులోనే 1962లో అకాల మృత్యువాతబడిరి. అప్పటికి రాధాకృష్ణమూర్తిగారి వయస్సు 19 సం॥లు మాత్రమే. అప్పటికి మిగిలిన నలుగురు ఆడపిల్లలు, నలుగురు మొగపిల్లతో పెద్ద కుటుంబ బాధ్యత అంతా తల్లిగారైన వీరరాఘవమ్మగారిపై బడినది. మూర్తిగారు కుటుంబ బాధ్యతల నిర్వహణలో తల్లిగారికి సహకరిస్తూనే తన చదువును కొనసాగించిరి. తండ్రిగారి కోరికమేరకు తల్లిగారు మూర్తిగారి విమోకానికల్ ఇంజినీరింగు పూర్తి అయ్యేవరకు చదివించిరి. 1967 సం॥ నాటికి B.Sc., తరువాత B.E. (Mechanical)డిగ్రీతో చదువును ముగించారు.

అనంతరము మూర్తిగారు మినిస్ట్రీ ఆఫ్ డిఫెన్సులో ఉద్యోగము సంపాదించి గవర్నమెంట్ ఆఫ్ ఇండియా సంబంధిత ఆఫీసులలో పనిచేశారు. క్రమంగా సీనియర్ సైంటిస్ట్ అయ్యారు. ఆ విధముగా భారత ప్రభుత్వ రక్షణశాఖలో పని చేస్తూనే తన తమ్ముళ్ళు ముగ్గురికి వారి ఇష్టముల మేరకు సంతృప్తిగా చదివించిరి. దురదృష్టవగాత్తు తల్లిగారు తన 68 సం॥ వయస్సులో 1985 సం॥లో దివంగతులైనారు. అప్పటికి మూర్తిగారి వయస్సు 42 సం॥లు తరువాత వారు శ్రమించి 1994లో మిగిలిన ఒక చెల్లెలికి పెళ్ళిచేశారు. 'దానితో తన తండ్రిగారి చివరి కోరిక "అందరు బాగుండాలి" అనే తన

కోరికను పూర్తిచేసి పితృవాక్య పరిపాలకులయినారు. మూర్తిగారు మాత్రము నైష్ఠిక బ్రహ్మచారులుగానే ఇప్పటికి మిగిలి ఉన్నారు.

అనంతరము శ్రీ రాధాకృష్ణమూర్తిగారు తమ తల్లిదండ్రులపేరున **'మానుకొండ వీరరాఘవమ్మ మరియు క్రిష్ణయ్యగార్ల మెమోరియల్ చారిటబుల్** ట్రస్టు'ను 2006 సం॥లో స్థాపించిరి. అప్పటి నుండి వ్యవస్థాపక అధ్యక్షుడిగా ఆ ట్రస్టు పేరుతో అనేకమందికి అనేక రకములుగా ఆర్థిక సహాయము చేస్తూ వస్తున్నారు. ముఖ్యంగా వైదిక ధర్మ ప్రచారమునకు పాటుపడుచున్న పండితులకు, సంస్థలకు ఉదారంగా చేయూత నిస్తున్నారు. వైదిక గురుకులాలకు, విద్యార్థులకు ఫీజులతో మరియు రోగులకు మందుల రూపములో సహాయము చేస్తూ ఉన్నారు. పేద వృద్ధులకు నెలవారి పించనులు గాను, కళ్ళకు ఆపరేషన్లకు గాను, ఇలా సమాజానికి సేవలందిచుచున్నారు. అంతేగాక గోదావరి కృష్ణానదుల పుష్కరాల సందర్భంగా సుమారు 27 వేలమందికి తమ తల్లిదండ్రుల పేరుమీద అన్నప్రసాదవితరణ కావించారు.

తెనాలిలో ఆర్య సమాజ భవనమునకు, నందివెలుగు వృద్ధాశ్రమమునకు, రాయపూడి వైదిక ఆశ్రమమునకు విరివిగా సాయం చేస్తున్నారు.

ఇక వారి ఆధ్యాత్మిక క్షేత్రాన్ని పరిశీలించితే- శ్రీ రాధాకృష్ణమూర్తి గారికి 25 సం॥ల వయస్సులోనే తెనాలి పట్టణంలో 1967 సం॥లలో శ్రీ గానం రామారావు (రామదేవ్)గారి ద్వారా ఆర్య సమాజ సిద్ధాంతాలతో పరిచయం కలిగినది. ఆ వైదిక సిద్ధాంతాలు హేతుబద్ధం గానే కాక వైజ్ఞానికంగా కూడ ఉన్నాయని వీరు గ్రహించారు. శ్రీరామదేవ్‌గారే స్వయంగా, 'విద్వత్ శిరోమణి', 'షడ్దర్శనాచార్య', 'కళాప్రపూర్ణ' బిరుదాంకితులయిన పండిత గోపదేవ్‌శాస్త్రిగారితో పరిచయం చేశారు. ఆ గురుదేవుల ద్వారా వైదిక సిద్ధాంతాలను బాగుగా అవగాహన చేసుకున్నారు. వాటిపై శ్రద్ధ ఏర్పడినది. అప్పటినుండి 1996 లో శ్రీ శాస్త్రిగారు పరమపదించే వరకు తరచుగా గురువుగారిని కలుసుకుంటూ వారి జ్ఞానాన్ని మరింత విస్తృతం చేసుకున్నారు.

ప్రస్తుతం వీరు 76 సం॥ వయసులో ఆరోగ్యముగానే ఉన్నారు. హైదరాబాదునందుగల హైదర్‌నగర్ (మియాపూర్) ప్రాంతములో నివసిస్తున్నారు. ఎవరైనా మిత్రులు వారిని కలవటానికి వస్తే వారితో ఆధ్యాత్మిక,

భౌతిక విషయాలు ప్రస్తావిస్తూ వైదిక సిద్ధాంతాలను సెంటిఫిక్‌గా విశ్లేషించి చెబుతూ, అవగాహన కలిగించుతూ జ్ఞాన బోధ చేసి పంపుతున్నారు.

అట్టి ఆదర్శ పురుషులకు సర్వవ్యాపక సర్వేశ్వరుడు శతాధిక ఆయువును ప్రసాదించుగాక! ఇదే ఉత్సాహంగా, మరెన్నోరకములుగా వైదిక ధర్మమునకు, సత్పాత్రులైన పేదలకు, విద్యావంతులకు సేవలందిస్తూ ఉందురుగాక! పరమాత్మ వారికి తగిన ఆయురారోగ్యములను ప్రసాదించునుగాక !

## శ్రీరాధాకృష్ణమూర్తిగారితో నా స్వంత పరిచయము-అనుభవము

శ్రీమాన్ మానుకొండ రాధాకృష్ణమూర్తిగారు, ఆర్యసమాజ క్షేత్రములో ఉన్న పండితులకు, ప్రచారకులకు అందరకు తెలిసినవారే.

సుమారు 10 సం॥ క్రిందట నేను ప్రస్తుతం నివసిస్తున్న "వైదిక వానప్రస్థాశ్రమము (భువనగిరి)నకు తన స్నేహితుడు శ్రీభావజుల సదానందాచారి గారితో కలిసి రాధాకృష్ణమూర్తిగారు రావటం జరిగినది. అప్పుడే నాకు వారితో ప్రథమ పరిచయం ఏర్పడినది. అనంతరం వారిని మా గాయత్రీ ఆశ్రమాని (సీతాఫల్‌మండి)కి వచ్చి చూసివెళ్ళమని నేను కొరడం, వారు వచ్చి వెళ్ళటం, అట్లాగే నేనును హైదర్‌నగరు హైదరాబాదులోని వారి నివాసం చూసి రావటం జరిగాయి.

ఆ పరిచయముతో వారు నావలెనే ఒంటరి జీవితం గడపటం ఇంటిపనులు, వంటపనులు-స్వయంగా చేసుకుంటూ ఆధ్యాత్మిక యౌగిక జీవితం గపడటం మొదలైన విషయాలను గుర్తించాను. దానితో నాకు వారిపై శ్రద్ధ ఏర్పడినది. వారికి కూడ నాపై అభిమానము అనుగ్రహముల కలిగాయి. దానితో నా స్వంత అవసరములను ఏదైనా ఆర్థిక సహాయము అవసరముంటే, నిస్సందేహంగా తనకు తెలుపమని అడిగిరి. తన శక్తికొలది సాయం చేస్తామన్నారు." అట్లే నాకు కంటి రెటీనా సమస్య వచ్చినప్పుడు, 2,3 పర్యాయముల ఆర్థిక సహాయము చేశారు. సమస్య కొంత ఉపశమించిన తదుపరి నా జీర్ణశక్తి చాలా ఇబ్బంది పెట్టినది. దానితో వారు మరొక సారి స్పందించి తనకు వేరేవైద్యులవలన తగ్గిన కొన్ని బాధలు సిద్ధవైద్యంతో

తగ్గాయని మీరు వెంటనే బయలుదేరి వస్తే ఆ వైద్యుని వద్దకు తీసుకొని వేళతాననీ అందుకు కావలసిన ఖర్చులు అన్ని నేనే భరించుతానని కొండంత భరోసా నిచ్చారు. అన్నట్లుగానే నన్ను ఎల్లారెడ్డి గూడ హైదరాబాదులో ఆ సిద్ధవైద్యుని వద్దకు తీసివెళ్ళి మందులు ఇప్పించారు. అందుకు అవసరమయిన డాక్టరు ఫీజులు, మందుల ఖర్చులు అన్నీ ఉదారంగా వారే భరించారు.

అంతేగాక, ముద్రణకు చాలా కాలంగా ఎదురుచూస్తున్న ఈ "వేదామృతం" పుస్తకాన్ని ముద్రించి ఇవ్వవలసినదిగా కోరినప్పుడు దానికి వెంటనే స్పందించి అంగీకరించారు. ఇంతేగాక నేను ముద్రించదలచిన ప్రతి గ్రంథానికి కూడా ధన సహాయం చేయగలని హామీ ఇచ్చినారు. ఈ గ్రంథాన్ని 1000 ప్రతులు ముద్రించుటకు గాను పూర్తి ఖర్చు మొత్తం 20,000/- రూపాయలను గాయత్రి ఆశ్రమ ట్రస్టుకు దానంగా ఇచ్చారు. ఇట్టి విశాల హృదయులయిన శ్రీరాధాకృష్ణమూర్తి(యం.ఆర్.కె.మూర్తి)గారికి నా హృదయపూర్వక ధన్యవాదములు, కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

సర్వవ్యాపక సర్వేశ్వరుడు వీరికి శతాధిక ఆయువును, ఆరోగ్య మును, ఉత్సాహమును ఇచ్చి కాపాడుగాక ! మరెన్నో దాన ధర్మములు చేసి పుణ్యభాగులగునట్లు ప్రేరేపించునుగాక!

బుధజనవిధేయుడు

సుమ్నార్థి

డా.కోదూరి సుబ్బారావు

**దానవిశిష్టత**

గౌరవం ప్రాప్యతే దానాత్ న తు విత్తస్య సంచయాత్ ।

స్థితిరుచ్చైః పయోదానాం పయోధీనామధఃస్థితిః ॥ -గుణరత్నం

**భావము:-** గౌరవం ధనాన్ని కూడబెట్టడం వలన రాదు. దానం వల్లనే కలుగుతుంది. గొప్పవాడే అయినా సముద్రునికి అధఃస్థితియే, మేఘానికే ఉన్నతస్థితి.

# వేదామృతం

అమృతం అంటే మృత్యురహితమని అర్థం. ఎప్పటికీ నిలిచి ఉండేదని భావం. సామాన్య దృష్టితో లోకాన్ని పరిశీలించి చూస్తే మృతిచెందకుండా ఏ ప్రాణీ ఉండరు. "జాతస్య హిధ్రువో మృత్యుః" = పుట్టిన ప్రతీదీ నిశ్చయంగా మరణిస్తుంది" అనేది సృష్టినియమం. అయితే లోకంలో పురాణాల ప్రభావంవల్ల ధృవుడు, మార్కండేయుడు, ఆంజనేయుడు మొదలైనవారు చావకుండా ఉండే వరం పొందారు కనుక వారు ఇప్పటికీ జీవించి ఉన్నారనే నమ్మకం ప్రజలలో బాగా నాటుకు పోయింది. మనం కూడా తపస్సుచేసి ఇష్టదైవాన్ని సాక్షాత్కరించుకొని చనిపోని వరం పొందగలిగితే మనం కూడా వారివలెనే ఉండి పోగలమని కొందరను కుంటారు. ఆ మూఢనమ్మకం బాగా ముదిరి ముదిరి కొందరు మా గురువులు కూడా చిరంజీవులు. వారు సమాధిని పొంది దశాబ్దాలు గడచిపోతున్నా వారు లోకంలో పంచరిస్తూ భక్తులను అనుగ్రహిస్తూ ఉంటారు" అనే మూఢ నమ్మకాలను వారి శిష్యులు ప్రచారం చేస్తున్నారు. కాని, ఇవేవీ సత్యాలు కావు. కేవలం మూఢ నమ్మకాలు మాత్రమే.

ఇక మన ప్రాచీన ఇతిహాసాలైన రామాయణ, మహాభారతాలలో సృష్టి ఆరంభంలో దేవతలు, అసురులు కలిసి పాలసముద్ర మంథనం చేశారనీ అందుండి కామధేనువు, కల్పవృక్షాల అనంతరం అమృతభాంఢం లభించిందనే కథలు వ్రాసి ఉన్నాయి. ఇట్టివి ఏవో కొన్ని ఆధ్యాత్మిక విషయాలను తెలిపే ఆలంకారిక వర్ణనలు మాత్రమే. మనం వైదిక దృష్టికోణంతో ఆలోచిస్తే- చతుర్వేదాలే పాల సముద్రం. దానిని మంథనం చేస్తే- అధ్యయన, మనన చింతనలు చేస్తే కామధేనువు, కల్పవృక్షం వంటి అనేక విద్యావిజ్ఞానాలు వెలికివస్తాయి... అసురులు- చెడు సంస్కారాలు, చెడు ఆలోచనలు కలవారు వాటిని తమ ప్రార్థం కోసం, విలాసాలకోసం వాడుకుంటూ సంతృప్తిచెంది **ఉంటారు.** దేవతలు భౌతిక విజ్ఞానంతో సంతృప్తి చెందక మరింత లోతుగా అధ్యయనం చెయ్యగా వానికి ఆత్మజ్ఞానం' కలిగి వారు- మేము ఈ శరీరాలు

కాదు. జీవాత్మలం. దేవుని వలె మేమును అమృతులం. శాశ్వతులం. అని గ్రహించి అందుకు తగినట్లుగా జీవించి ఉంటారు.

జగత్ప్రసిద్ధమైన భగవద్గీత రెండవ అధ్యాయం ఆలోచిస్తూ అధ్యయనం చేస్తే ఈ విషయం మీకు మరింత స్పష్టమౌతుంది.

శ్లో. **న జాయతే మ్రియతే వా కదా చిత్**
**నాయం భూత్వా భవితా వా న భూయః,**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే ॥** (భ.గీ. 2-20)

భా: జీవాత్మ ఎప్పుడును పుట్టునదికాదు. అట్లే మరణించునదియును కాదు. అది నిత్యము, శాశ్వతము. కాలాంతరంలో శరీరం నశించునేకాని జీవాత్మ నశించదు.

శ్లో. **వాసాంసి జీర్ణాని యథావిహాయ**
**నవాని గృహ్ణాతి నరోఽపరాణి,**
**తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని**
**సంయాతి నవాని దేహీ॥** (భ.గీ. 2-22)

భా: మనష్యుడు చిరిగిన వస్త్రాలను వదిలి నూతన వస్త్రాలను ధరించునట్లు జీవుడు వృద్ధాప్యంతో, వ్యాధులతో జీర్ణశీర్ణములైన శరీరాలను విడిచి క్రొత్త దేహాలను ధరిస్తాడు.

ఇట్టి విషయాలను విని మననం చేస్తూవుంటే క్రమంగా ఆత్మజ్ఞానం జీర్ణమౌతుంది. తాను శరీర రథాన్ని అధిరోహించి తిరుగుతున్న రాజునని గుర్తించి ఆ విధంగా జీవిస్తాడు. ధర్మాత్ముడౌతాడు. మరణానికి వెరువక జీవమ్ముక్తునివలె జీవిస్తాడు. యోగసాధన పరిపక్వమైనపుడు ఆత్మ పరమాత్మల సాక్షాత్కారమౌతుంది. ప్రారబ్ధం పూర్తయిన అనంతరం పరమేశ్వరుని తృతీయధామానికి– ఆనంద ధామానికి చేరుకుంటాడు. ఈ విషయమే రాబోవు మృత్యుంజయాది మంత్రాలలో వివరంగా తెలుసుకుందాము.

# సార్వజనిక నియమాలు

-మహర్షి దయానందసరస్వతి

1. సమస్త సత్యవిద్యలకును, విద్యవలన నెరుంగదగు సర్వపదార్థముల కును ఆదిమూలము పరమేశ్వరుడు.
2. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళువు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.
3. వేదము సత్యవిద్యల గ్రంథము. దీనిని చదువుట - చదివించుట, వినుట - వినిపించుట, ఆర్యులకందరికి పరమ ధర్మము.
4. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడును సిద్ధముగా నుండవలెను.
5. సకల కార్యములను ధర్మానుసారముగా అనగా సత్యాసత్యములను విచారించి చేయవలెను.
6. ప్రపంచమునకు ఉపకారము చేయుట, ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము.
7. అందరితో ప్రేమ పూర్వకముగ ధర్మానుసారముగ యథాయోగ్యముగ వ్యవహరింపవలెను.
8. అవిద్యను నశింపచేసి విద్యను పెంపొందింప జేయవలెను.
9. ప్రతివ్యక్తియు తన ఉన్నతితోనే సంతృప్తినొందక, అందరి ఉన్నతిలోనే తన ఉన్నతి కలదని తలంపవలెను.
10. సర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తి హితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందరికి తగును.

# విషయసూచిక


ప్రార్థన, తొలిపలుకులు, సంపాదకీయం,

1. మృత్యుంజయ మహామంత్రం..... 15
2. యజుర్వేదీయ మృత్యుంజయ మహామంత్రం 19
3. గావో విశ్వస్య మాతరః 24
4. మనం మూడు ఋణాలతో పుట్టాము. 28
5. మన శరీరంలో త్రైతవాదం పూర్తిగా వైజ్ఞానికం 32
6. మనసా పరిక్రమమే ప్రత్యాహారం 36
7. అగ్నిమీళే పురోహితమ్ 41
8. మనిషికి జీవితేచ్ఛ అవసరం 46
9. పునర్జన్మలు సత్యమా? 57
10. వేదాలలో పునర్జన్మలు 61
11. అదుగో దేవుడు నీటిలో కనబడుతున్నాడు. 66
12. స్వస్తి పంథామనుచరేమ. 71


**గాయత్రీమహామంత్రము**

ఓం భూర్భువస్స్వః । తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ।
ధియో యో నః ప్రచోదయాత్ ॥

ఋ. 3.62.10.,యజు. 3.35,22.9,30.2,36.3,సామ. 1462

భావార్థము:- ఓ సచ్చిదానంద స్వరూపా! నీ దివ్యము వరేణ్యమునైన శుద్ధవిజ్ఞాన స్వరూపమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము. మాకు సద్బుద్ధినిచ్చి సత్కర్మల నాచరించునట్లు అనుగ్రహింపుము.

## సంపూర్ణ ఆరోగ్యం కొరకు

♦బ్రహ్మముహూర్తంలో (ఉదయం 4 గంటలకు) నిద్రలేవాలి. ♦ కాచి, చల్లార్చి వడబోసిన నీరునే త్రాగాలి. ♦త్రాగడానికి వేడి నీటిని, స్నానానికి చల్లని నీటిని వాడండి. ♦ఉడికీ ఉడకని ఆహారాన్ని తినవద్దు. ఆహారాన్ని బాగా నమిలి తగినంత లాలాజలం ఊరిన తర్వాత మ్రింగాలి. ♦అన్నం వండేటప్పుడు గంజి వార్చవద్దు. ♦తిన్నవెంటనే నీటిని తాగరాదు. ఒక గంట తర్వాతనే త్రాగాలి. ♦మీ శరీర బరువును బట్టి నీటిని తాగాలి. 60 కేజీలు బరువున్న వ్యక్తి రోజుకు 6 లీటర్ల వరకు నీటిని త్రాగవచ్చు. ♦ఆహారం తిని పూర్తయిన ప్రతిసారీ కనీసం 6-9 సార్లు నోటిని పుక్కిలించి ఉమ్మాలి. ♦మలమూత్ర విసర్జన తర్వాత 6 సార్లు పుక్కిలించి ఉమ్మాలి. ♦మలబద్ధకం అనారోగ్యానికి హేతువు. రోజుకు రెండుసార్లు విరేచనానికి వెళ్ళాలి. ♦గ్యాస్ సమస్య రావడానికి కారణం మసాలాలు తినడం. వ్యాయామం శారీరకశ్రమ చేయక పోవడం. ♦అతిబరువు కలిగిన వారు నిత్య రోగులే కనుక మీ శరీర బరువును నియంత్రణలో ఉంచండి. ♦బరువు పెరగడానికి కారనం ఆహారమే. ఇతరాలేవీ కావు. ♦నిత్యం ప్రాణాయామం, యోగ, వ్యాయామం కనీసం అరగంట చేయాలి. ♦నిత్యం అనుతైలం రెండు చుక్కలు చొప్పున ముక్కులో వేసుకోవాలి. ♦పళ్ళు తోముకోవడానికి కేవలం ఆయుర్వేద పళ్ళపొడిని మాత్రమే వాడాలి. ♦ప్రతిరోజూ తైలంతో శరీర మర్ధన చేసుకుని స్నానం చేయాలి. ♦చిలికి వెన్న తీసిన మజ్జిగనే త్రాగాలి. ♦ఏ పూటకాపూట తాజాగా వండిన భోజనం ఉదయం పూర్తిగానూ, మధ్యాహ్నం మధ్యరకంగానూ, సాయంత్రం అల్పాహారంగానూ భుజించాలి. ♦రాత్రి పాదాలకు నువ్వులనూనెతో మర్దన చేసుకుని త్వరగా నిద్రించాలి. ♦వండిన తరువాత బాగా చల్లబడినవి, వండి ఫ్రిజ్‌లో పెట్టినవి సేవించరాదు. ♦వంటల్లో రిఫైన్డ్ ఆయిల్ వాడకుండా గానుగ పట్టించిన నూనెను వాడండి. ♦మద్యపానం, మాంసాహారం, ధూమపానం, శీతల పానీయాలు, బేకరీ, ఫాస్ట్‌ఫుడ్స్ తీసుకోకూడదు.



# 1. మృత్యుంజయ మహామంత్రం

ఓం త్ర్యమ్బకం యజామహే సుగన్ధిం పుష్టివర్ధనమ్ ।
ఉర్వారుకమివ బన్ధనాన్మృత్యోర్ముక్షీయ మామృతాత్ ॥

- ఋగ్వేదం (7-59-12)

ఓ త్ర్యంబకేశ్వరా! త్రిలోకాధిపతీ ! త్రికాలజ్ఞానీ ! నిన్ను మేము సదా స్మరింతుము గాక! పూజింతుము గాక! సుగంధితము పుష్టివర్ధకమునైన దోసపండు తీగనుండి సునాయాసంగా (చాలా తేలికగా) విడిపోవునట్లు నీవు మమ్ము మృత్యువునుండి, కష్టాలనుండి విడిపించుము. కానీ, నీ అమరత్వధామాన్నుండి మాత్రం మమ్ము వేరు చేయవద్దు.

ఈ ఋగ్వేదమంత్రం లోకంలో మృత్యుంజయ మహామంత్రంగా ప్రసిద్ధి చెందింది. ప్రయాణ సమయంలో దీనిని జపిస్తే ప్రమాదాలకు గురి కాకుండా క్షేమంగా తిరిగి వస్తామని ఒక నమ్మకం. కానీ, భక్తి శ్రద్ధలతో ఈ మంత్రజపం చేస్తున్నా కొందరు ప్రమాదాలకు గురికావటం, మరణించటం కూడా జరుగుతున్నది కదా! అందుకు పెద్ద నిదర్శనం కొన్ని నెలల క్రితం కేదార్‌నాథ్ యాత్రికులకు జరిగిన ప్రమాదాలు. అలాగే కష్టాలలో బాధలలో ఆపదలలో ఈ మంత్రజపం చేస్తే అవన్నీ తొలగిపోతాయనుకోవటం కూడా ఒక నమ్మకం మాత్రమే.

ఈ వేదమంత్రం ద్వారా పరమేశ్వరు డుపదేశించే విషయం చాలా లోతైనది. చాలా ఉన్నతమైనది. ఈ మంత్రంలోని పదములలో చాలా లోతైన అర్థాలున్నాయి. చాలా విశాలమైన విస్తృతమైన అర్థాలు కూడా ఉన్నాయి. వాటిలో ముఖ్యమైన కొన్నిటిని వ్యాసంలో తెలుసుకునే ప్రయత్నం చేద్దాము.

## 'త్ర్యమ్బకం యజామహే'

అంటే-మేము త్ర్యంబకుని పూజింతుము గాక అని అర్థం. సంస్కృతంలో అంబకము అంటే లోకము, అమ్మ, ఆకాశము అనే అర్థాలున్నాయి. నేత్రము అనే అర్థము కూడా ఉందంటారు కొందరు. వైదిక వ్యాకరణాన్ననుసరించి ఈ పదము 'త్రి+అంబ+క' కలిసి త్ర్యమ్బకః అయ్యింది. అది ద్వితీయా విభక్తిలో

త్ర్యమ్బకమ్ అయ్యింది. కనుక మూడు అంబకములు కలవాడు అని అర్థం. అందువల్ల త్ర్యంబకుని - త్రిలోకాధిపతిని, త్రిలోకమాతను, త్రినేత్రుని - త్రికాలదర్శిని మొదలగు అర్థాలు తీయవచ్చు. అటువంటివాడు పరమేశ్వరుడుగాక మరెవరుంటారు? మన వేదశాస్త్రాలు దేవుడు ఒకే ఒక్కడనీ, ఆ ఒక్కనికే అనేక పేర్లున్నాయనీ పలుమార్లు ఘోషిస్తాయి. **"ఏకం సత్ విప్రా బహుధా వదంతి, ఏకో దేవః సర్వభూతేషు", ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై ఎవ్వనియందు డిందు"** అనే వాక్యాలు చాలా కనబడతాయి. అందుచేతనే మహర్షి దయానందులవారు "ముక్కాల ములందును ఏకరసుడు, జ్ఞానయుక్తుడు, దాతయు, దుష్టులనేడ్పించువాడునగు జగదీశ్వరు"డని త్ర్యంబకమ్ పదమునకు తమ వేద భాష్యంలో అర్థం వ్రాశారు.

అంబకము అంటే నేత్రము అని అర్థం చెప్పేవారు త్రినేత్రుడు శివుడు కదా! అని పౌరాణిక రుద్రునికి అన్వయింపజేస్తారు. మహారాష్ట్రలోని నాసిక్‌లో త్ర్యంబకేశ్వరాలయం ఉంది కదా! అంటారు. త్రినేత్రుడు అనేది ఒకకల్పన. త్రికాలదర్శి అనటం మంచిది. సర్వవ్యాపక ఏకేశ్వరునే వేదాలు 'త్ర్యంబకః' అనే నామంతో పేర్కొంటాయని గుర్తించాలి.

## సుగన్ధిమ్ పుష్టివర్ధనమ్ ఉర్వారుకమ్ + ఇవ

ఉర్వారుకమంటే దోసపండు. అది పచ్చిగా ఉన్నప్పుడు దోసతీగతో గట్టిగా బంధింపబడి ఉంటుంది. గట్టిగా లాగినా అది ఊడిరాదు. కాయ కావాలంటే తీగ కోయవలసిందే. అదే కాయ బాగా పండితే సునాయాసంగా - చాలా తేలికగా పండు పట్టుకుంటే చాలు తీగనుండి విడిపోతుంది. ఇంతేగాక, బాగా పండితే అది సువాసనలను వెదజల్లుతుంది. అట్టి పండు మనకు పుష్టిని కలిగిస్తుంది. మాధుర్యాన్ని ఇస్తుంది. కడుపునిండిన సంతృప్తిని కలిగిస్తుంది. ఆ విధంగా ఓ పరమేశ్వరా! మమ్ము మృత్యువునుండి, కష్టాలనుండి విడదీయుమని తదుపరి వాక్యంలో ప్రార్థన వస్తుంది. ఇది ఉపమాన వాక్యం. ఈ మంత్రం ఉపమాలంకారంలో మనకు ఒక లోతైన ఆధ్యాత్మిక విషయాన్ని బోధిస్తున్నది.

ఉర్వారుక మనే పదానికి లోకంలో దోస లేదా కర్బూజా అనే అర్థాలున్నా వేద పదములన్నీ యౌగికములు, కనుక ధాతుప్రత్యయాలను విశ్లేషించ

వలసి ఉంటుంది. ఈ పదము ఉరు + ఆ + రుక్ అనే మూడు పదములు కలిసి తయారయ్యింది. 'ఉరు' అనేది విశేషణం. దీనికి పెద్దది గొప్పది అనే అర్థాలుంటాయి. ఆ అంటే (ఆ-సమంతాత్) సమగ్రంగా (సంపూర్ణంగా) అని అర్థం. ఇంతేగాక, దీనికి అభిముఖమగుట (ఒక దానివైపు మరలుట) అనే అర్థం కూడా ఉంది. ఇక చివరి పదము 'రుక్'. ఈ పదం యొక్క మూలార్థాన్ని సమాధినిష్ఠుడై అంతర్యామియైన పరమేశ్వరుని ద్వారా తెలుసుకున్న యాజ్ఞ్యవల్క్య మహర్షి తమ శతపథ బ్రాహ్మణ గ్రంథం (9-4-2-14)లో **"అమృతత్త్వం వై రుక్"** అని నిర్వచించారు. అంటే - గొప్పదైన అమృతత్త్వ ప్రవాహం పండువైపు ప్రవహించుచున్నదని అర్థం.

ఇది నిజమే. ఎట్లంటే - కాయ తీగతో కలపబడింది. తీగ భూమిలో నాటుకుంది. భూమాతసారం తీగ ద్వారా కాయలో ప్రవహించింది. అందువల్ల కాయ క్రమంగా పెరిగి పెద్దదై పోషక విలువలు సంతరించుకొని సుగంధితము కూడా అయ్యింది. కాయ పండుగా పక్వమయ్యేవరకు తీగ కాయను గట్టిగా పట్టుకుని ఉంటుంది. బాగా పక్వం కాగానే తన పట్టును విడిచిపెడుతుంది. అట్లే మానవులు ఈ ప్రకృతిలో (ప్రపంచంలో) పూర్ణత్వాన్ని పొందాలి. పుష్టిని పొందాలి. అరిషడ్వర్గాలతో, ఈషణత్రయాలతో పోరాడి జయించాలి. ఈర్ష్యాద్వేషాలను, ఇంద్రియాలను, మనస్సును నిగ్రహించగలగాలి. స్థితప్రజ్ఞులం కావాలి. సద్గుణాలతో సుగంధితులం కావాలి. అప్పుడే మనకు త్రివిధ దుఃఖాలనుండి విముక్తి కలుగుతుంది. జనన మరణ చక్రబంధనం తొలగిపోతుంది. లేకుంటే లేదు. ఇదే విషయం తదుపరి వాక్యం చెబుతుంది.

## బంధనాత్ మృత్యోః ముక్షీయ

మనం ఇప్పుడు స్వతంత్ర భారతదేశంలో - వాక్ స్వాతంత్ర్యం గల ప్రజాస్వామ్య దేశంలో ఉన్నాము. మనం యిక్కడ న్యాయార్జిత సుఖ సాధనాలతో ఏ బంధనాలూ లేకుండా స్వతంత్రులుగా జీవితం గడుపుతూవున్నా మనకు సూక్ష్మమైన కొన్ని ఆధ్యాత్మిక బంధనాలుంటాయి. అందులో ముఖ్యమైనవి కర్మబంధనాలు. మనం మన మనోవాక్కాయములతో చేసిన కర్మలే మనను ఈ జనన-మరణరూప సంసార చక్రంలో బంధిస్తున్నాయి. వీటితోబాటు విషయ సుఖాలకు సంబంధించిన రాగం, ఆ సుఖాలకు అడ్డుపడేవారిపై ద్వేషం కూడా మనను బంధించి ఉంచాయి. ఇవన్నీ రజోగుణ తమోగుణాలకు చెందిన బంధనాలు. సత్వగుణం కూడా ఒక బంధనమే అంటుంది భగవద్గీత.

(గుణము అనే పదమునకు త్రాడు అనే అర్థం కూడా ఉంది). గీతలోని గుణత్రయ విభాగయోగం చదవండి విశదమౌతుంది.

ఈ వేదవాక్యం పై బంధనాలనన్నింటిని మృత్యువులంటున్నది. జనన మరణాలను కలిగిస్తాయంటున్నది. "హే త్ర్యంబకేశ్వరా! మమ్మ ఈ బంధనాలన్నింటినుండి విడిపించు" అనే ప్రార్థన పై వాక్యంలో ఉంది. అంతేకాని మృత్యువు అంటే మనం చూసే ప్రాణుల మరణం కాదు. ఆ మృత్యువును ఎవరూ తప్పించలేరు. దేవుడు కూడా. **"జాతస్య హి ధ్రువో మృత్యుః"** అనేది సృష్టికర్త ఏర్పరచిన నియమమే. తను పెట్టిన నియమాన్ని తానెట్లు తప్పుతాడు?

## మా అమృతాత్

ఓ త్ర్యంబకేశ్వరా! నన్ను మరల మరల మృత్యువును కలిగించే ప్రకృతి బంధనాలన్నిటినుండి విడిపించు కానీ, నీ ఆనందమయ అమృతత్వాన్నుండి మాత్రం మమ్మ విడిపించవద్దు.

పరమేశ్వరుని గుణగణాలు, శక్తి సామర్థ్యాలు, పరిమాణం అనంతం. వీటితోబాటు అతడు ఆనందస్వరూపుడు - ఆనందమయుడు. ప్రకృతి బంధనాలనుండి విడివడిన జీవుడు ఆనందస్వరూపుడైన దేవుని తృతీయధామంలో స్వేచ్ఛగా విహరిస్తాడు. ఈ స్థితిని - **"యత్ర దేవా అమృతమానశానాః + తృతీయ్యేధామన్ + అధ్యైరయన్త** (యజు - 32-10)" అంటుంది వేదం. మరొకచోట - **"పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి** (యజు. 31-3)" అంటుంది.

బంధ విముక్తి పొందిన జీవులు అట్టి ఆనందధామంలో పరాంతకాలం వరకు స్వేచ్ఛగా విహరిస్తారు. తాము తెలుసుకోగోరిన పదార్థాల యథార్థజ్ఞానాన్ని పరమేశ్వరుని నుండి, తోటి ముక్తజీవుల నుండి గ్రహిస్తారు. వారి జ్ఞానం పెరిగే కొలది వారి ఆనందం పెరుగుతూ ఉంటుంది. పరాంతకాలం అంటే 36,000 పర్యాయాలు సృష్టి స్థితి లయాలు జరిగినంత కాలం.

ఇదీ సంక్షిప్తంగా మృత్యుంజయమంత్రము యొక్క అసలు అర్థం. దీనిపై ఒక పెద్ద పుస్తకమే వ్రాయవచ్చు. గంటలకొలది ప్రవచించవచ్చు. కాని, ఇప్పుడు

(1824-1883) వారి ఆవిర్భావం జరిగింది. పూర్వ సంస్కారాల ప్రభావంతో శ్రీ ఆది శంకరాచార్యులవారి వలెనే చిన్ననాడే ఇల్లు వదిలి సన్న్యాసియై దేశసంచారం చేసి ఆనాటి ఆ పరిస్థితిని అర్థం చేసుకున్నారు. వేదార్థాన్ని చక్కగా తెలుసుకోగోరి ప్రజ్ఞాచక్షువైన విరజానందస్వామికి శిష్యుడై వైదిక వ్యాకరణాన్ని, నిరుక్తాన్ని (వేద పదముల నిర్వచన శాస్త్రాన్ని) చక్కగా అభ్యసించి దానిపై పట్టు సాధించారు. బ్రాహ్మణ ఆరణ్యకాదులలోని వేద వ్యాఖ్యానాల్ని పరిశీలించి, ఆ ప్రాచీన ఋషుల మార్గంలోనే వేదాలకు భాష్యం వ్రాయటం ప్రారంభించారు. అప్పుడు ప్రచారంలో ఉన్న సాయణ, ఉవ్వట, మహీధరాదుల భాష్యాలలోని లోపాలను సప్రమాణికంగా ఖండిస్తూ యజుర్వేదానికి పూర్తిగా భాష్యం వ్రాశారు. అట్లే, విదేశీ విద్వాంసుల ఆంగ్ల భాష్యాలలోని లోపాలను కూడా ఎత్తి చూపించారు.

మహర్షి ముందుగా వేదాలలో కేవలం ఆధ్యాత్మిక విద్యలే కాకుండా అన్నిరకాల విద్యావిజ్ఞానాలున్నట్లు సంకేతరూపంగా తెలుపుతూ **'ఋగ్వేదాది భాష్య భూమిక'** అనే పేరుతో ఒక పెద్ద గ్రంథం వ్రాశారు. తాను వ్రాయబోవు నాలుగు వేదాల భాష్యానికి అది ఒక పెద్ద భూమిక (Foreword) అన్నమాట. వారు వేదభాష్యం ఋగ్వేదంతో ప్రారంభించినా మూఢ నమ్మకాలలో చాలా భాగం అవైదిక యజుర్వేద భాష్యం వల్లనే వచ్చినదని గుర్తించి ఋగ్వేదాన్ని మధ్యలో ఆపి యజుర్వేదానికి పూర్తిగా భాష్యం వ్రాశారు. అందులో యజ్ఞం పేరుతో జరిగే పశుహింసకు కారణం వేదాన్ని సరిగ్గా అర్థం చేసుకోకపోవడమేనని సప్రమాణికంగా నిరూపిస్తూ భాష్యం వ్రాశారు. వారు ఆనాటి వేదపండితులతో శాస్త్రార్థాలు జరిపి శ్రీ ఆదిశంకరాచార్యులవారివలె విజయాలను పొందారు. వేదం ఏ ప్రాణినీ హింసించవద్దని చెప్పటమేకాక అన్ని ప్రాణులను మిత్రదృష్టితో చూడమంటుందని నిరూపించారు.

ధ్వర అంటే హింస అని అర్థం. దానికి ముందు 'అ' చేర్చటం వల్ల వ్యతిరేకార్థమైనది. అగ్నిహోత్రానికి గల నామాలలో 'అధ్వర'మనే పేరు ఒకటి. అగ్నిహోత్రం హింసారహితమైనదని బోధిస్తున్నది కదా! అని నిలదీశారు. అందుచేతనే ఈ కలియుగంలో వేదాలనుద్ధరించిన ఖ్యాతి మహర్షి

దయానందులవారికే దక్కింది. అట్టి మహర్షి తమ యజుర్వేద భాష్యంలో ఈ మంత్రంలోని **'పతి వేదనమ్'** అను పదమును ఈ క్రింది విధంగా నిర్వచించారు.

## పతి వేదనమ్

**"పాతి రక్షతి సః పతిః, పతేర్వేదనం (పతేః+వేదనం) ప్రాపణం జ్ఞానమ్ వా యస్మాత్ + తమ్"** - అంటే పాలించి పోషించేవానిని 'పతి' అంటారు. అట్టి పతిని గురించిన జ్ఞానాన్ని వేదం ద్వారా యిచ్చినవాడు అని ఆ పదము యొక్క అర్థం". అని వివరించారు ఇక్కడ 'పతి' అనే పదము ఆధ్యాత్మికార్థంలో చెప్పబడింది కనుక సమస్త ప్రాణులను రక్షించే పరమాత్మ అని అర్థం వస్తుంది. అట్టి పరమాత్మ విషయక జ్ఞానాన్ని యిచ్చినవాడు కూడా అతడే కదా! కనుక అతనికి 'పతి వేదనమ్' అనే విశేషణం చేర్చబడింది". అన్నారు.

నిజంగా ఆత్మ పరమాత్మలను గూర్చిన జ్ఞానం మనకు వేదాల ద్వారానే వచ్చింది. సృష్ట్యాదిలో మానవులకు సృష్టికర్త తన స్వరూప స్వభావాలను తెలుపకుంటే మనకు అతనిని గురించిన సత్యమైన, స్పష్టమైన జ్ఞానం కలిగి ఉండేది కాదు. ఏవేవో ఊహించుకుంటూ ఉండేవారం. దర్శన ఉపనిషదాదులను వ్రాసిన ఋషులకు కూడా ఆ జ్ఞానం వేదాల ద్వారానే వచ్చింది. ఆ మాట వారి గ్రంథాలలోనే వ్రాసిపెట్టారు. ఇంతేగాక, దేవుని గురించి తెలుసుకోవాలంటే ముందుగా వేదవాక్కుల ద్వారానే వినాలని (శ్రోతవ్యః శృతి వాక్యేభ్యః) సూత్రాలు వ్రాసిపెట్టారు.

నాలుగు వేదాలలోను ఎక్కడా పరస్పర విరుద్ధ వాక్యాలుండవు. అన్ని విషయాలు స్పష్టంగా, హేతుబద్ధంగా చెప్పబడ్డాయి. అందుకనే ఋషులు తమ గ్రంథాలలో **'తద్వచనాత్ ఆమ్నాయస్య ప్రామాణ్యమ్ (వై.ద.)'** అని వేదాలను పరమ ప్రమాణాలుగా నొక్కి వక్కాణించారు. అయితే ఆ వేద పదములు సరిగ్గా అర్థం కావాలంటే వేదాంగాలను తప్పక అధ్యయనం చెయ్యవలసిందే. అట్లే మన కష్టాలు, దుఃఖాలు పూర్తిగాపోయి, అన్ని బంధనాలనుండి త్రివిధ శరీర బంధనాలనుండి, త్రివిధ లోకాల బంధనాలనుండి విముక్తిని పొందాలంటే పరమాత్మ యొక్క తృతీయధామాన్ని చేరాలంటే అష్టాంగ యోగ మార్గాన సాధన చేసి నిర్వికల్ప సమాధిని

పొందవలసిందే. ఆత్మ, పరమాత్మల సాక్షాత్కారం పొందవలసిందే. మరో మార్గం లేదంటుంది వేదం -

**వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।**
**తమేవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ ॥**

- యజుర్వేదం (31-18)

**భావార్థం:** అజ్ఞానాంధకారానికి ఆవల సహస్ర కోటి సూర్యసమప్రభతో వెలుగొందుమహాన్త పురుషుని నిర్వికల్ప సమాధి స్థితిలో దర్శించిన సిద్ధపురుషులే ఈ మృత్యురూప సంసార సాగరాన్ని తరించి అమృతత్వ పరమానందాన్ని పొందగలరు. దీనికన్న వేరొక సరళమార్గం లేనేలేదు అంటుంది వేదం.

ఇట్లే, ఉపనిషత్తులునూ ఘోషిస్తున్నాయి -

**శ్లో॥ ఏకో వశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధాః యః కరోతి,**
**త మాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః తేషాం సుఖం శాశ్వతం నేత రేషామ్ ॥**
**నిత్యోఽనిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విధధాతి కామాన్,**
**తమాత్మస్థం యేఽనుపశ్యం ధీరాః తేషాం సుఖా శాశ్వతం నేత రేషామ్ ॥**

- కఠోపనిషత్తు (5-12, 13)

"ఎవరు సర్వాంతర్యామియై ఏకరూపంలో ఉన్న మూల ప్రకృతిని అనేక మార్పులతో ఈ విశ్వంలోని అనేకానేక పదార్థాలుగా సృజించాడో, ఎవడు మానవులు చేయు వివిధ కర్మలకు న్యాయంగా ఫలాలనిచ్చుచున్నాడో అట్టి సర్వాంతర్యామియైన పరమాత్మను ఏ ధీరులు యోగసాధన చేసి అనుపశ్యతులౌతారో వారే శాశ్వతమైన సుఖాన్ని, శాశ్వతమైన శాంతిని పొందుతారు. ఇతరులెవ్వరూ అట్టి పరమానంద రూప ముక్తిని పొందలేరు" అంటున్నాయి ఉపనిషత్తులు. కనుక మృత్యుంజయ మంత్రం జపించినంత మాత్రాన మృత్యువు రాకుండా పోదు. సమస్త దుఃఖాలనుండి విముక్తి రాదు. అష్టాంగ రాజయోగ మార్గాన్ని అనుసరించి యమ నియమాలను గట్టిగా పాటిస్తూ, ధ్యానయోగ సాధన చెయ్యాలి. మన సాధన ఎంత తీవ్రంగా ఉంటే

అంత తొందరగా సమాధి సిద్ధిస్తుంది. ఆత్మ సాక్షాత్కారమౌతుంది. జీవుడు తన అసలు రూపాన్ని దర్శిస్తాడు. ఆ సాధన వదిలిపెట్టక ఇంకా ఇంకా ధ్యానసాధన చేస్తే జీవాత్మలో వ్యాపించిఉన్న పరమాత్మ (విశ్వాత్మ) సాక్షాత్కారమౌతుంది. దీనినే కఠోపనిషత్‌లోని పై శ్లోకాలు "అనుపశ్యతులైన ధీరులు" - ధ్యానశీలురు అంటున్నది. దీనిని యోగదర్శనం నిర్బీజసమాధి అంటుంది. అప్పుడే మృత్యు బంధనాలన్నీ తొలగిపోతాయి. అట్టి యోగులు ప్రారబ్ధం పూర్తయిన తరువాత శరీరాన్ని స్వేచ్ఛగా విడిచి, దేవయాన మార్గాన పయనించి, త్రిలోకాలను దాటి పరమాత్ముని తృతీయధామానికి చేరుకుంటారు. అక్కడ స్వేచ్ఛగా విహరిస్తూ పరాంతకాలం వరకు అమృతత్వాన్ని అనుభవిస్తారు.

కనుక ఈ యజుర్వేదీయ మృత్యుంజయ మంత్రంలో విశేషంగా కనబడుతున్న 3, 4 పాదములకు ఈ క్రింది విధంగా అర్థం చెప్పుకోవాలి -

**-0-**

ఓ త్ర్యంబకేశ్వరా! త్రిలోకాధిపతీ! నీవు వేదం ద్వారా యిచ్చిన ఆత్మపరమాత్మల జ్ఞానంతో మేము చేయవలసిన సాధనలన్నీ చేసి సద్గుణాలతో సుగంధితుల మగుదుము గాక! దోసపండు పక్వమై తీగను వదిలిపెట్టునట్లు అనాయాసంగా (బన్ధనాత్ + ఇతః + ముక్షీయ + మా + అముతః) ఈ సంసార మృత్యు బంధాలనన్నింటినుండి విడిపోదుము గాక! నీ అమృతధామం చేరుకొందుముగాక! అక్కడ నుండి విముఖులమై విడిపోకుందుముగాక!

# 3."గావో విశ్వస్య మాతరః"

## ఆవులు విశ్వజనులందరికి అమ్మవంటివి

మనం పసితనంలో అమ్మపాలు త్రాగి పోషించబడ్డాము. క్రమంగా అమ్మపాలు తగ్గిపోతాయి కనుక మనకు 6వ నెలలో అన్నప్రాశనం చేసి అన్నం తినే అలవాటు చేశారు. ఎంత మంచి అన్నం పప్పులు కూరలు నూనెలు తిన్నా అంత సంతృప్తినివ్వవు. వాటితో బాటు పాలు, పెరుగు, వెన్న, నెయ్యి వంటివి తింటేనే ఆ భోజనం సంతృప్తినిస్తుంది. ఆధునిక ఆహార విజ్ఞానం ప్రకారం కూడా పాలు లేదా పాలతో తయారైన పదార్థాలు ఉంటేనే అది సమతుల్య భోజనం అవుతుంది. అయితే మనకు లభించే రకరకాల పాలలో ఏవి శ్రేష్ఠమైనవి? అని ప్రశ్నించుకుని ఆలోచిస్తే ఆవుపాలే శ్రేష్ఠమైనవని గట్టిగా చెప్పవచ్చు. ఎందుచేతనంటే - ఆవుపాలు తల్లిపాలతో సమానమైన పోషక విలువలను కలిగి ఉంటాయి. అవి తేలికగా జీర్ణమై సత్వరంగా శక్తిని ఉత్సాహాన్ని ఇస్తాయి. వాటిలోని కెరాటిన్‌లో 'ఎ' విటమిన్ ఉంటుంది. అది శరీర ఎదుగుదలకు, రోగాల నిరోధానికి, ఎముకల అరుగుదలను పూరించటానికి ఎంతో సహకరిస్తుంది. ఆధునిక వైద్యులు కూడా కాల్షియంతోపాటు విటమిన్స్ ఎ మరియు డి ఉంటేనే కాల్షియం మెటబాలిజం బాగా జరుగుతుందంటారు.

పై ప్రయోజనాలతోపాటు ఆవుపాలలోని కెరాటిన్ - గోధుమరంగు మన మెదడులోని గ్రేమేటర్‌ను పెంచుతుంది. తద్వారా మన అవగాహనశక్తి జ్ఞాపకశక్తి పెరుగుతాయి. అందుచే విద్యార్థులకు, మెదడుతో పనిచేసేవారికి ఆవుపాలు ఎంతో మేలు చేస్తాయి. కెరాటిన్ వల్ల శరీర వర్చస్సు పెరుగుతుంది. అందం, ఆరోగ్యం మెరుగుపడతాయి. ఆవుపాలలోని క్రొవ్వు తేలికగా జీర్ణమై మన శరీరంలోని చర్మం క్రింద ఉండే క్రొవ్వు పొరగా మారుతుంది. మన అందానికి ఆ యా అవయవాల సౌష్ఠవానికి చర్మం క్రింద ఉండే క్రొవ్వు పొరే కారణం. ఆ క్రొవ్వు పొర ఎక్కడ ఎంత ఉండాలో అంత ఉంటే శరీరం అందంగా ఆకర్షణీయంగా ఉంటుంది. అదే హెచ్చుతగ్గులుగా ఏర్పడితే అందవికారాన్ని కలిగిస్తుంది. ఆవుపాలలో ఉండే క్రొవ్వు మనకు హాని చెయ్యదు. వ్యాధికారక కొలెస్ట్రాల్‌ను పెంచదు. మిగతా జంతువుల పాలు వ్యాధికారక కొలెస్ట్రాల్‌ను పెంచే అవకాశం ఎక్కువ. ఇట్టి భౌతిక ప్రయోజనాలనే కాక,

ఆవుపాలు మన మనస్సులో సత్త్వగుణాన్ని, ఉత్సాహాన్ని, స్ఫూర్తిని కలిగిస్తాయి. గేదెపాలు మనలో తమోగుణాన్ని, మందకొడితనాన్ని, అతినిద్రను కలిగిస్తాయి. అందుచేతనే మన పూర్వులు ఆవుపాలే త్రాగుతూ ఆవుపై మమకారాన్ని పెంచుకున్నారు. వాటి సంక్షేమం కోసం కృషి చేశారు. గోవును మాతగా భావించారు.

గోవును మాతగా భావించటం, మమకారాన్ని పెంచుకోవటం సహజమే. ఎట్లంటే - తల్లి రక్తమే అమ్మ ఎదలోని స్తన్యగ్రంథులలో పాలుగా మారి స్రవిస్తాయి. అవి పిల్లలలో రసంగా (లింఫ్‌గా) మారి రక్తంలో కలుస్తాయి. ఒక రకంగా తల్లి రక్తమే పసిపిల్లలలో రక్తంగా ప్రవహించి శరీరాన్ని పోషించి పెద్ద చేస్తాయి. అందుచే మనకు తండ్రికన్న, దగ్గర బంధువులకన్న తల్లే ప్రియమైదనే స్పర్శభావన కలుగుతుంది. అమ్మంటే మనకు ఎక్కువ ఇష్టమవుతుంది. అట్లే మనం పెద్దగ అయిన తరువాత తల్లిపాలను వదిలి ఆవుపాలను త్రాగటం ప్రారంభిస్తాము. ఆవులు మనకు పనికిరాని గడ్డిగాదములు తిని జీర్ణం చేసుకొని రక్తంగా మార్చుకుంటాయి. తల్లిలో వలెనే ఆవురక్తం పొదుగులో పాలుగా మారి స్రవిస్తాయి. ఆ పాలు మనం త్రాగి మన రక్తంగా మార్చుకుంటాము. కనుక, ఆవుపై మాతృభావన కలగటం సహజమే.

సృష్టికర్తయైన దేవుడు సృష్ట్యాదిలో యోగ్యులైన ఋషుల హృదయాలలో వేదజ్ఞానాన్ని ప్రకాశింపజేశాడు. సృష్టి విజ్ఞానాన్ని, సామాజిక రీతినీతులను వేదాలలో ఉపదేశించాడు. 20,416 మంత్రాలుగల ఆ విశాల వేదాలలో గోవును గురించిన విషయాలు వేలకొలది ఉన్నాయి. కొన్ని ప్రత్యేక గోసూక్తాలు కూడా ఉన్నాయి. వాటిలో ఒక మంత్రం ఏమంటుందంటే -

**యూయం గావో మేదయథా కృశంచిదశ్రీరం చిత్ కృణుథా సుప్రతీకమ్।**
**భద్రం గృహం కృణుథ భద్రవాచో బృహద్ వో వయ ఉచ్యతే సభాసు ॥**

- ఋగ్వేదం (6-28-6)

ఓ గోమాతా! నీవు నీ పాలతో దుర్బలుని, కృశించినవానిని బలవంతునిగా, పుష్టివంతునిగా చేయుదువు. శోభారహితుని - అందవిహీనున్ని చూడముచ్చటగా చేయుదువు. అట్టి నీవు మా గృహమును కల్యాణకరము చేయుము. నీ గొప్పతనమును నీవల్ల కలిగే గొప్ప లాభాలను సభలలో సమావేశాలలో ఉచ్చ స్వరంతో మేము కీర్తింతుముగాక!

ఆవుయొక్క పాలేగాక వాటి మలమూత్రాలు కూడా గొప్ప మేలు చేస్తాయి. గోమయంలో గోమూత్రంలో ఎన్నో ఔషధగుణాలున్నాయి. వాటిని వివిధ రకాలుగా మార్చుకుని మందులుగా వాడుకోవచ్చు. గోమయంతో ఇంటిముందు కళ్ళాపి చల్లుకుంటే అది ఇంటికి వచ్చేవారి ద్వారా రోగకారక క్రిములు ఇంట్లోకి రాకుండా నిరోధిస్తుంది. గోమయం వాటిని చంపుతుంది కూడా. కొన్ని పరిశోధనలలో తేలిందేమిటంటే - గోమయం రేడియో ధార్మికశక్తిని కూడా నిరోధిస్తున్నదట. ఆవు పిడకలతో, ఆవునేతితో యజ్ఞం చేసి ఆ బూడిదను జల్లించి లేదా వస్త్రగాలితం చేసి మందులుగా వాడుకోవచ్చు. దానిని బిళ్ళలుగా, క్యాప్సూల్సుగా చేసి లోపలికి ఔషధంగా ఉపయోగించుకోవచ్చు. విభూతిగా వంటికి రాసుకున్నా చర్మరోగాలు ఉపశమిస్తున్నాయట. దానిలో కొద్దిగా కరిగిన ఆవునెయ్యిని కలిపి గాయాలకు కట్లు కడితే అవి త్వరగా మానుతున్నాయని గుర్తించబడింది. ఆవుపేడ ఎరువు మిగిలిన అన్నిరకాల ఎరువులకన్నా మేలైన పంటదిగుబడులనిస్తున్నదనీ, గోమూత్రంలో కొంత నీరు, గోమయం కలిపి చెట్లపై పిచికారీ చేస్తే అద్భుతమైన క్రిమి సంహారకంగా (Pesticide)గా పనిచేస్తున్నది. ఆహారంతో అది మన శరీరంలోకి పోయినా మంచినే చేస్తుందిగానీ కీడు చెయ్యదు. మిగిలిన ఏ జంతువు మలమూత్రాలలోనూ ఇట్టి సుగుణాలు లేవు. కనుకనే సృష్టికర్త సభలలో సమావేశాలలో గోగుణాలను కీర్తిస్తూ ప్రజలందరికి, ముందు తరాలకు ఈ జ్ఞానాన్ని అందివ్వమని ఆదేశించాడు.

ఇంతేగాక, గోవును హింసించేవారిని, చంపేవారిని కఠినంగా శిక్షించమని సృష్టికర్త ఉపదేశించాడు. గోవులను పూజించమనీ ఉపదేశించాడు. అవి ముసలివైతే మీ ముసలి తల్లిదండ్రులను పోషించినట్లే పోషించమన్నాడు. ఈ వేదాదేశాలనే మన పూర్వులంతా పాటించారు. మన రాజులు, మహారాజులు, చక్రవర్తులు శాసనాలు చేసి గోవులను రక్షించారు. మహాభారత కాలంలో 'కంసుడు' అనే రాజు గోహంతకుడై రాక్షసుడయ్యాడు. అతడు బలవంతుడు కనుక అతనినెవ్వరూ ఎదిరించి దారిలో పెట్టలేకపోయారు. ఆనాటి గోభక్తులు అతని రాజ్యానికి బయట ఒక లంకలోనికి గోవులను తరలించి రక్షించ యత్నించారు. **'రాధ'** అనే పేరుతో ఒక గోసంరక్షణ పోరాటసమితిని స్థాపించి 'వృషభాను'డను వ్యక్తిని నాయకునిగా చేశారు. అతను పెద్ద వయస్కుడై ఆ భారాన్ని మన ఆదర్శ పురుషుడైన శ్రీకృష్ణునిపై పెట్టాడు.

ఈ సత్యాన్ని మన పిచ్చి భక్తులు రాధను ఒక స్త్రీగాను, వృషభానుని కూతురుగాను, శ్రీకృష్ణుని ప్రేయసిగాను అలంకారికంగా వర్ణించి ముందుతరాలను అజ్ఞానంలో పడవేశారు. వివరాలకు పం.భవానీలాల్ భారతిగారి పరిశోధనాత్మక రచన శ్రీకృష్ణ చరిత్రను చదవండి. అప్పుడు మన శ్రీకృష్ణుడు బంధుప్రీతిని ప్రక్కకు పెట్టి మామయైన కంసుని సంహరించాడు. ఆ విధంగా గోవులను రక్షించి గోపాలకృష్ణుడయ్యాడు.

విదేశీయులు మన రాజ్యాన్ని పాలించిన మధ్యకాలంలో కూడా హిందువుల కొన్ని నమ్మకాలను వారు గౌరవించారు. ఈ విషయం మొగలాయి సామ్రాజ్య స్థాపకుడైన బాబరు తన కుమారుడైన హుమయూన్‌కు ఒక పెద్ద లేఖ వ్రాశారు. అందులో గోవుని గురించి వ్రాస్తూ "నీవు సంకుచిత సంప్రదాయాలకు తలయొగ్గక న్యాయంగా పాలన చెయ్యి. ముఖ్యంగా గోహత్య జరగకుండా జాగ్రత్త వహించు" అని హెచ్చరించాడు. క్రీ.శ. 1586వ సంవత్సరంలో అక్బర్ అప్పటి మౌల్వీలను సంప్రదించి గోహత్య నివారణ చట్టము చేశాడు. అది ఏమంటే - "ప్రతి జంతువు వలన ఏదో ఒక లాభం ఉండియే ఉ ంటుంది. వీనిలో గోవులు అత్యంత ఉపయోగకరమైనవి. ఎందుచేతనంటే మానవులు వ్యవసాయం ద్వారా వచ్చే ఆహారం తిని జీవిస్తారు. వ్యవసాయం చెయ్యక ఆహారం లభించదు. నాగలి దున్నుటకు ఎద్దులు అవసరము. అది గోసంతతియే. ఇంతేగాక, గోవువల్ల మరెన్నో ప్రయోజనాలున్నాయి. సమస్త పశువుల, మానవుల జీవనాధారం గోవు అని స్పష్టమౌతున్నది. పై కారణాలవల్ల నా రాజ్యంలో గోహత్య పూర్తిగా నిషేధించబడవలెనని కోరుచున్నాను. ఎవరైనా ఈ ఆజ్ఞను అతిక్రమించిన చేతివ్రేళ్ళు నరకబడును. ఉరిశిక్షకు గురిచేయబడుదురు" అని ఆ చట్టం చెబుతున్నది. ఆ చట్టం ప్రతి ఇప్పటికీ గ్వాలియర్ సంస్థానంలో ఉన్నదని పరిశోధకులు వ్రాశారు. జహంగీర్, షాజహాను కూడా ఈ గోహత్యా నిరోధ చట్టాన్ని అమలు పరిచారు. ఔరంగజేబు మతాంధుడై ఈ చట్టాన్ని తీసివేశాడు. ఇట్టి మరెన్నో విషయాలు తెలుసుకోగోరేవారు నా రచన 'గోమాత' పుస్తకంలో చూడండి. అట్టి గోమాతను నేడు బాహాటంగా వధించి విందు చేసుకునే ప్రయత్నం చెయ్యటం గర్హనీయం. మా ఆర్య సమాజం ఈ చర్యను నిరసిస్తున్నది.

-0-

## 4. మనం మూడు ఋణాలతో పుట్టాము!!

జాయమానో హి వై పురుషః త్రీణ్ ఋణవాన్

అభిజాయతే । ఋణాని త్రీణి అపాకృత్య

మనో మోక్షే నివేశయేత్ ॥ – ఉపనిషత్ సంగ్రహం

పురుషుడు (మనుష్యుడు) మూడు ఋణాలతో పుడుతాడు. ఆ మూడు ఋణాలను తీర్చుకున్నవాడే విశుద్ధమైన మనస్సును పొంది మోక్షమును పొందుటకు అర్హుడగుచున్నాడు. అవే – పితృ, దేవ, ఋషి ఋణాలు.

పై ఋషివాక్కులు మనకు వింతగా అనిపించవచ్చును– కానీ యివి పూర్తిగా సత్యం. సామాన్యంగా ఋణం అంటే అప్పు. ఏదైనా క్లిష్ట పరిస్థితి ఏర్పడినప్పుడు ఉన్నవారినుండి కొంత అప్పుగా తీసుకుంటాము. క్రమంగా దానిని తీర్చివేస్తూ ఉంటాము. ఆ అప్పు ధనరూపంలోనే ఉండాలని లేదు. అది వస్తువు కావచ్చు. సేవలు కావచ్చు. మాటసాయం కావచ్చు. శరణాగతి కావచ్చు. మరేదైనా కావచ్చు. సామాజిక జీవనంలో ఇవన్నీ సామాన్యమే. అయితే జన్మతోనే అప్పులు ఎందుకు వస్తాయన్నది జిజ్ఞాసువుల ప్రశ్న.

### పితృఋణం

ఋషులు చెప్పే పై మూడు ఋణాలలో మొదటిది పితృఋణం. మనకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకు మనం ఋణపడి ఉంటాము. ఎట్లంటే – తల్లి మనను నవమాసాలు గర్భంలో మొయ్యటమే కాకుండా తన శరీరంలోని రక్తాన్ని పంచి యిచ్చింది. తద్వారా ప్రొటీన్లను, క్రొవ్వులను, కార్బోహైడ్రేట్లను, జీవరసాయనాలను (Bio-Chemics), విటమిన్లను ఇచ్చి మన శరీరానికి ఉపాదాన కారణమయ్యింది – నిర్మాత్రి అయ్యింది. గర్భ సమయంలో ఎన్నో ఇబ్బందులకు గురి అయ్యింది. ఎన్నో జాగ్రత్తలు తీసుకుంది. పథ్యాలు చేసింది. మందులు వేసుకుంది. చాలా కష్టాన్ని సహించి కాన్పు జరిపి మనను భూమిపైకి తీసుకువచ్చింది. మల మూత్రాదులను అసహ్యించుకోకుండా ఎన్నో రకాల సేవలు చేసింది. మనకు అన్నాదులు జీర్ణమయ్యేవరకు తన రక్తాన్ని పాలుగా మార్చి పోషించింది. నడక మాటలు స్నాన శౌచ వస్త్రధారణాదులు నేర్పింది. ఇలా వ్రాసుకుంటూపోతే పెద్ద పుస్తకమే అవుతుంది.

ప్రత్యక్షంగా కాకున్నా పరోక్షంగా తండ్రి చేసిన సేవలు కూడా చాలానే ఉంటాయి. ఆయన సంపాదించి ఆలనా పాలనా చూసుకోబట్టే అమ్మ నిశ్చింతగా మనకు సేవలు చెయ్యగలిగింది. తండ్రి మనను పోషించి చదివించి విద్యాబుద్ధులు, సభ్యతా సంస్కారాలు, సమాజంలో మెలగవలసిన తీరుతెన్నులు నేర్పారు. తన ఆస్తిపాస్తులకు వారసులను చేశారు. కనుక మాతాపితరుల ఋణం (పితృఋణం) మనకు పుట్టుకతోనే వస్తుంది. మన జ్ఞాన వికాసానికి వారే మొదటి కారణాలు. అందుచేతనే **"మాతృమాన్ పితృమాన్ ఆచార్యవాన్ పురుషో వేద"** అంటుంది శతపథ బ్రాహ్మణం (14-06-10). "మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ" అంటుంది తైత్తరీయోపనిషత్ (శిక్షావల్లి-11).

ఈ మొదటిదైన పితృఋణం తీరాలంటే వారు జీవించి ఉన్నప్పుడే వారికి సేవలు చేసి, వారితో ప్రియంగా వ్యవహరించి తీర్చుకోవాలి. వారు వృద్ధాప్యంవల్లగానీ, వ్యాధివల్లగానీ మరే కారణంతోనైనా గానీ అశక్తులైనప్పుడు వారికి అవసరమైన అన్ని రకాల సేవలు చెయ్యాలి. వారి మనస్సు నొప్పింపక ప్రేమతో వ్యవహరించాలి. వారికి మనం అనువ్రతులం కావాలి.

అంటే - వారు చేసిన దాన ధర్మాది సత్కార్యాలను, పరోపకార అభయ దానాది వంశ మర్యాదలను మనం అనుసరించి చేస్తూ ఉండాలి. **"అనువ్రతః పితుః పుత్రః మాత్రా భవతు సంమనాః"** అంటుంది అథర్వవేదం (3-30-2).

మహాభారత యుద్ధం తరువాత మనదేశంలో కొన్ని అవైదిక పురాణాల కల్పన జరిగింది. కొందరు స్వార్థపరులు స్వప్రయోజనం కొరకు కొన్ని సంప్రదాయాలను, ఆచారాలను పురాణాలుగా వ్రాసిపెట్టారు. అందులోనిదే మృతక శ్రాద్ధ తర్పణాది ఆచారం. వివరంగా తెలుసుకోగోరువారు మహర్షి దయానంద సరస్వతుల వారి జగత్ప్రసిద్ధ రచన "సత్యార్థ ప్రకాశం"లోని ఏకాదశ సముల్లాసం చదువగోరుచున్నాము. ఇక మనం రెండవ ఋణం గురించి తెలుసుకుందాం. రెండవది -

## దేవఋణం

దేవతలు అంటే "దివ్యమైన పరోపకారాది దివ్యగుణాలు కలిగినవా"రని అర్థం. ఆ దివ్య గుణాలు వ్యక్తులలో ఉంటే వారిని చేతన దేవతలనీ, పదార్థాలలో ఉంటే వాటిని జడ దేవతలనీ అంటారు. చేతనము అంటే జ్ఞానం కలదియనీ, జడము అంటే జ్ఞానం లేనిది అనీ అర్థం. ఈ రెండవ ఋణం జడదేవతల ఋణం. జడదేవతలలో ముందుగా లెక్కించదగినవి పంచభూతాలు భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము.

ఈ పంచభూతాల ఋణం మనకు జన్మతోనే వస్తుంది. ఎందు చేతనంటే - వాటితోనే మన శరీరాలు నిర్మించబడ్డాయి. పెరిగి పెద్దవైనాయి. ఇప్పుడును వాటిలోనే, వాటి ఆధారంతోనే జీవిస్తున్నాయి. వీటిలో జ్ఞానం లేకపోయినా ఇవి సదా ప్రాణులకు మేలు చేస్తూనే ఉంటాయి. కనుక వీటిని జడ దేవతలన్నారు.

మన శరీరాల ద్వారా వెలువడే మల మూత్ర స్వేద నిశ్వాసాల ద్వారా ఈ పంచభూతాలు నిత్యం మలినమౌతూ ఉంటాయి. వాటిని శుద్ధిచేసే ఏర్పాట్లు సృష్టిలో ఉన్నా బుద్ధిజీవులమైన మనం కూడా కొంత ప్రయత్నం చెయ్యాలి అంటుంది వేదం. ప్రతీ వ్యక్తి ఉదయం సాయంసమయాలలో పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనలతోబాటు దైనిక అగ్నిహోత్ర కార్యం చెయ్యాలంటుంది యజుర్వేదం. ఇది పర్యావరణాన్ని పరిశుద్ధంచేసే ఒక వైజ్ఞానిక ప్రక్రియ. మామిడి మోదుగ రావి మొదలైన సమిధలతో అగ్నిని జ్వలింపజేసి దానిలో దేశీయ ఆవునేతిని ఆహుతులుగా ఇవ్వాలి. దానితోపాటు ఆయా ఋతువులకు అనుకూలమైన మూలికలను, సుగంధ ద్రవ్యాలను ఆహుతులుగా యిస్తే చక్కటి ఫలితాలు కలుగుతాయి. గృహంలోని, పరిసరాలలోని వాయువు శుద్ధమౌతుంది. తద్వారా ఇంట్లోనివారందరికి చక్కటి ఆరోగ్యం, బలం, ఉత్సాహం, స్ఫూర్తి కలుగుతాయి. ఈవిధంగా దైనిక అగ్నిహోత్రం చేస్తూ దేవతల ఋణం తీర్చుకోవాలి.

## ఋషిఋణం

ఋషి ఋణం అంటే జ్ఞానఋణం. సృష్టి కర్తయైన సర్వవ్యాపక సర్వేశ్వరుడు ఆదిమానవ సృష్టి సమయంలోనే యోగ్యులైన నలుగురు ఋషుల

హృదయాలలో ఋగ్ యజుర్ సామ అథర్వ వేదాలను ప్రకాశపరచాడు. వారు వాటిని తోటి సామాన్య మానవులకు నేర్పారు. ఆ మంత్రాలను అర్థం చేసుకోవటానికి కావలసిన వేదాంగాలను - శిక్షా కల్పవ్యాకరణ నిరుక్త ఛందో జ్యోతిష్యాలను రూపొందించి శిష్యుల కుపదేశించారు. ఆనాటినుండి ఈనాటివరకు గురుశిష్య పరంపరగా వేదాలు, వేదాంగాలు వస్తున్నాయి. తదుపరి వచ్చిన ఋషులు వాటి ఆధారంతో పరిశోధనలు జరిపి ఉపవేదాలు, ఉపనిషత్తులు, దర్శనాలు, మొదలైన అనేకానేక శాస్త్రాలు వ్రాశారు. వాటిని లోకంలో విస్తృతంగా ప్రచారం చేశారు. అందువల్ల అవి మనవరకు నిలిచి ఉన్నాయి. కనుక మనం కూడా మన శక్తికొలది కొన్ని శాస్త్రాలను అధ్యయనం చేసి వాటికి మన అనుభవాన్ని జోడించి ముందు తరాలకు అందించే ప్రయత్నం చెయ్యాలి. అలా చేస్తేనే ఋషిఋణం తీరుతుందంటాయి శాస్త్రాలు.

**స్వాధ్యాయేనార్చయేత్ ఋషీన్, హోమైర్ దేవాన్ యథావిధి।**
**పితౄన్ శ్రాద్ధైశ్చ నౄనన్నైర్భూతాని బలికర్మణా ॥** - మను (3-81)

అంటే - "ఋషులు వ్రాసిన గ్రంథాలను అధ్యయన అధ్యాపనలు చేస్తూ ఋషుల ఋణాన్నీ, యథావిధిగా హోమాలు చేస్తూ దేవ ఋణాన్నీ, జీవితాన్నిచ్చిన మాతా పితరులకు శ్రద్ధతో సేవలు చేస్తూ పితృఋణాన్నీ తీర్చుకోవా"లంటాయి శాస్త్రాలు.

ఈ మూడు ఋణాలు మనకు జన్మతోనే వస్తాయని తెలపటానికే మూడు ప్రోగులు గల యజ్ఞోపవీతాన్ని ధరింపజేస్తారు మన పెద్దలు. అది సదా మన ఎడమ భుజంపైన ఉంటూ మనకు ఋణాలను గుర్తుచేస్తూ ఉంటుంది. విద్యా సదాచారాలు గల స్త్రీ పురుషులంతా ద్విజులేనంటాయి వేదశాస్త్రాలు. కనుక అట్టివారంతా యజ్ఞోపవీతం ధరించవచ్చు. మీరు ఏ వయస్సులో ఉన్నవారైనా మీకు యజ్ఞోపవీత సంస్కారం చేయటానికి ఆర్యసమాజం సదా సిద్ధంగా ఉంటుంది.

-0-

## 5. మన శరీరంలో త్రైతవాదం - పూర్తిగా వైజ్ఞానికం

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే" అనే వేదమంత్రం మన శరీరానికి కూడా అన్వయిస్తుంది. ఆలంకారికంగా మన శరీరాన్ని వృక్షమనుకుంటే - ప్రకృతి అనుకుంటే దీనిలో రెండు పక్షులు (చేతన తత్త్వాలు) కనబడతాయి. అందులో ఒకటి మనం. జీవాత్మలం. నా కాలు, నా చేయి, నా తల అనుకుంటూ మనం శరీరంకన్నా వేరుగా ఉన్నాము. మనకు కొద్దిగా జ్ఞానం కూడా ఉంది. కనుక వేదం మనను సుపర్ణులు అంటుంది. జ్ఞానం, ప్రయత్నం (కర్మలు) అనే రెండు రెక్కలతో మన లక్ష్యంవైపు ఎగిరిపోతూ ఉంటాము. మనకు అభిరుచి గల ఆ యా రంగాలలో ఉన్నతోన్నత శిఖరాలకు చేరుకుంటూ ఉంటాము.

మనకు శరీరం సాధనంగా ఉంటుంది. దానికి జ్ఞానం లేదు. అది మనం తినే ఆహారంతోనే పెరిగి పెద్దదయ్యింది. శక్తివంతమయ్యింది. ఆహారం భూమినుండి వచ్చిందే కదా! త్రాగే పానీయాలు, వీల్చే గాలి, పంచభూతాలలోనివే కదా! వాటిలో జ్ఞానంలేదు కనుక వాటినుండి ఉత్పన్నమయిన ఆహార పానీయాదులలోను జ్ఞానం ఉండదు. జ్ఞానంలేని ఆహార పానీయాలతో ఏర్పడిన శరీరంలో కూడా జ్ఞానం ఉండదు. అందుచే దానిని వృక్షంతో పోల్చింది వేదం. భూమినుండి ఉత్పన్నమయిన వృక్షం కొంతకాలం తదుపరి మరల భూమిలో కలిసిపోయినట్లే మన శరీరాలును కాలాంతరంలో భూమిలో కలిసిపోతాయి. కనుక శరీరం వృక్షంతో సమానం.

ఇక మూడవ తత్త్వం దేవుని గురించి వైజ్ఞానికంగా ఆలోచిద్దాము. మన శరీరంలో కాళ్ళు చేతులు ఇంద్రియాలు మన స్వాధీనంలోనే ఉన్నాయి. ఏదైనా వ్యాధి ఉంటే తప్ప చాలావరకు అవన్నీ మనం చెప్పినట్టే వింటాయి. కాని గుండె, ఊపిరితిత్తులు, జీర్ణమండలం, రక్త ప్రసార లింఫ్ ప్రసార మండలాలు, మూత్రపిండాలు, వివిధ గ్రంథులు మన ప్రమేయం లేకుండా వాటంతట అవే చాలా తెలివిగా నిర్విరామంగా పనిచేస్తున్నాయి. వాటిని ఎవరు పనిచేయిస్తున్నారు? అవన్నీ జ్ఞానంలేని ఆహార పానీయాలతో నిర్మింపబడినవే కదా! ఆధునిక వైద్యులు కొన్ని హార్మోన్ల ప్రభావంతో అవి పనిచేస్తున్నాయంటారు.

కొందరు మెదడు పంపే సంకేతాలవల్ల అంటారు. ఆ మెదడు కూడా ఆహార పానీయాలతో నిర్మింపబడినదే కదా! వాటిలో లేని జ్ఞానం ఆ యా అవయవాలకెలా వచ్చింది? కొందరు శరీరకణాలలోని క్రోమోజోమ్స్ మరియు అందలి జీన్స్ కారణమంటారు. అవి కూడా మాంసకృత్ నిర్మితాలే. అవి కూడా జడములే. జ్ఞానం లేనివే. కొందరిలో ఆ జీన్స్ వక్రించి దీర్ఘవ్యాధులను, నయంకాని వ్యాధులను కలిగిస్తున్నాయి. ఎందుచేత?

ఒకవేళ వీటిని జీవాత్మ కలిగిస్తున్నదా? జీవాత్మలంటే మనమే కదా! మనకి మనం జీన్స్‌ను చెడగొట్టుకొని వ్యాధులను కలిగించుకుంటామా? అసలు మనకట్టి శక్తి, జ్ఞానం ఉన్నాయా? మనకు రుచిగా వండుకొని తినటం వరకు తెలుసు, గొంతుదాటి, లోపలికి వెళ్ళి ఏ ఏ మార్పులు చెంది జీర్ణం అవుతున్నదో తెలియదు. ఏదైనా బాధ వస్తే తప్ప లేకుంటే కడుపు ఉన్నట్టే స్మృతి ఉండదు. అట్లే మన శరీరంలో ఎన్నెన్నో అవయవాలు గ్రంథులు ఉన్నాయి. వాటిలో ఏవైనా వ్యాధులు బాధలు వస్తేనే అవి మన స్మృతిలోకి వస్తాయి. లేకుంటే శరీరం మువ్వలాగా తేలికగా ఉంటుంది. ఎన్నెన్నో ఆటలు, కళలు అభ్యసిస్తాము. సత్కారాలను పురస్కారాలను అందుకుంటాము. కనుక అమ్మ కడుపులో మకీశరీరాన్ని నిర్మించినదీ, ఇప్పుడు జీవింపజేస్తున్నదీ మరొక తత్త్వం ఉంది. అదే దేవతత్త్వం. ఈవిధంగా మన శరీరంలోనే ప్రకృతితత్త్వం, జీవతత్త్వం, దేవతత్త్వం ఉన్నాయి. త్రైతవాదం మన శరీరంలోనే ఉంది.

సూక్ష్మంగా ఆలోచిస్తే మన శరీరంలో ఎన్నో వింతలు విడ్డూరాలు కనబడతాయి. శరీర నిర్మాణశాస్త్రం (Anatomy), శరీర ధర్మశాస్త్రం (Physiology) చదివితే చాలా ఆశ్చర్యం కలుగుతుంది. మనం పీల్చుకునే గాలిలో ఆక్సిజన్‌కన్నా నైట్రోజన్ 3 రెట్లు ఎక్కువగా ఉన్నా ఊపిరితిత్తులు ఆక్సిజన్‌ను మాత్రమే గ్రహిస్తాయి. గుండె ఆ ఆక్సిజన్‌ను, ఆహారసారాన్ని శరీరంలోని ప్రతికణానికి పంపిస్తుంది. రక్తం అక్కడున్న మలినాలను తీసుకెళ్ళి మూత్ర పిండాలలో శుద్ధిచేస్తుంది. ఎంత చక్కని ఏర్పాటు! వాటిని ఆవిధంగా నిర్మించిన దేవతత్త్వం అనంతజ్ఞానం, అనంత శక్తిసామర్థ్యాలు గలదని అర్థమౌతున్నది కదా! ఇంతేకాక, మనం మనస్సుతో చేసే పాపపు ఆలోచనలను, సద్భావాలను కూడా కనిపెడుతూ ఉంటుంది. శరీరంతో, వాక్కుతో చేసే చెడుకర్మలను

చూచినవారు, విన్నవారు మనను కొంత శిక్షించవచ్చు. సాక్ష్యాలన్నీ ఋజువైతే కోర్టులు మరికొన్ని శిక్షలు విధించవచ్చు. కాని మనసులో హత్య చేసే పథకాలను, కీడుచేసే ఆలోచనలను లోకంలో ఎవరు కనిపెట్టి శిక్షించగలరు? అట్టివాటికి కూడా దేవతత్త్వం తగినవిధంగా శిక్షిస్తుంది. ఆ ఆలోచనలు కార్యరూపం ధరించే సమయంలో ముందు దయతో హెచ్చరించి చూస్తుంది. భయాన్ని, సంకోచాన్ని కలిగించి చూస్తుంది. ఆ హెచ్చరికను, ప్రేరణను అర్థం చేసుకున్న బుద్ధిమంతులు ఆ చెడుకర్మ చేయకుండా ఇంద్రియాలను నిగ్రహించుకుంటారు. గీతలో (2-58లో) చెప్పినట్లు తనకేదైనా కీడు, ఆపద జరుగబోతోందని గుర్తిస్తే తాబేలు వెంటనే తన తలను, కాళ్ళు, చేతులను లోపలికి ముడుచుకొని ఒక డిప్పలా అయిపోతుంది. అట్లే స్థితప్రజ్ఞుడు (బుద్ధిమంతుడు) అంతర్యామి ప్రేరణలను గుర్తించి తన యింద్రియాలను నిగ్రహించుకుంటాడు. ఆ చెడుపని చేయకుండా ఆగిపోతాడు పశ్చాత్తాపపడతాడు.

అట్లే, మనం ఏదైనా మంచి పనులు - దానం, ధర్మం, త్యాగం, పరోపకారం మొదలగునవి చేస్తున్నప్పుడు మనకు లోపలినుండి ఆనందం, ప్రోత్సాహం, ధైర్యం, సహనం మొదలగునవి కలుగుతాయి. కనుకనే మన దేశ స్వాతంత్ర్యసమరంలో దేశభక్తులు, క్రాంతికారులు అంతటి పెద్ద పెద్ద శిక్షలను, క్రూరమైన హేయమైన శిక్షలను కూడా 'వందే మాతరం' అనుకుంటూ సంతోషంగా అనుభవించారు. మనకు స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెట్టారు. ఇట్టి అంతర్యామి ప్రేరణలే దైవతత్త్వం ప్రత్యక్షమౌతున్నట్లు నిరూపిస్తున్నాయంటారు దయానంద మహర్షి తమ 'సత్యార్థ ప్రకాశం' సప్తమ సముల్లాసంలో (ఇది చాల సూక్ష్మ విషయం. దానిని అక్కడ మహర్షి మాటలలోనే చదవండి). ఆయన అక్కడ ప్రత్యక్ష, అనుమాన, శబ్దాది అన్ని ప్రమాణాలతోను సరియైన దైవతత్త్వాన్ని తర్కంతో నిరూపించారు. **"యత్తర్కేన అనుసంధత్తే స ధర్మః"** - తర్కానికి నిలబడేదే ధర్మం అంటారు మన మహర్షులంతా. మనం వారి మార్గాన్ని అనుసరించటమే ఉత్తమం. మూఢ నమ్మకాలతో ముక్తి పొందటం అసాధ్యం. మనం ఏ రూపాన్ని ధ్యానిస్తే ఆ రూపంలోనే దేవుడు దర్శనమిస్తాడని కొందరు గురువులు ఉపదేశిస్తూ ఉంటారు. ఇది వారి వట్టి

భ్రమ. దేవుడు ఎలా వుంటాడో సరిగా తెలుసుకొని ఉపాసించమని వేదం స్పష్టంగా చెబుతుంది.

**వేదాహమేతం పురుషం మహాన్తమాదిత్య వర్ణం తమసః పరస్తాత్।**
**తమేవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ ॥**

- యజుర్వేదం (31-18)

**భావార్థం** - పరమపిత పరమేశ్వరా! అజ్ఞానాంధకారానికి ఆవల సహస్రకోటి సూర్య సమ ప్రభలతో వెలుగొందు మహాన్తపురుషుని - పరమేశ్వరుని దర్శించినవారే ఈ మృత్యురూప సంసార సాగరాన్ని తరించి అమృతత్వ ఆనందాన్ని పొందుదురు. దీనికన్న వేరొక సరళమార్గం లేనేలేదు. ఇది పూర్ణ సత్యం.

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్ + అన్యో అభిచాక శీతి ॥**

- ఋగ్వేదం (1-164-20)

**వాక్యార్థం:** ద్వా సుపర్ణా సయుజా సఖాయా = మంచి రెక్కలు గల రెండు పక్షులు - జీవాత్మ పరమాత్మలు వ్యాప్యవ్యాపకములుగా కలిసి యున్నవి. ఎప్పుడూ అవి రెండూ మిత్రులే - అనాదులే. సమానం వృక్షం పరిషస్వజాతే = ఈ రెండు వృక్షరూప విశ్వంలో వసించుచున్నవి.

తయోః + అన్యఃపిప్పలం స్వాదు + అత్తి = వాటిలో ఒకటి - జీవాత్మ అది సృష్టి వృక్షంలోని ఫలములను - విషయాలను తింటున్నది - అనుభవిస్తున్నది.

అనశ్నత్ + అన్యః + అభిచాకశీతి = మరొకటి - పరమాత్మ. తానేవీ విషయాలను అనుభవించకుండా అన్నిటిని చక్కగా పరిశీలిస్తున్నది.

Two birds like substances - God and Soul whose acts and knowledge are beautiful in their spheres and who are residing together and like friends, rest of the tree like material cause, the utter which is of the time of same eternity. One of the twain the soul eats the sweet and palatable fruit of the tree which the other (God) eating not, sees like an indifferent spectator.

# 6. మనసా పరిక్రమమే ప్రత్యాహారం

పరిక్రమమంటే ప్రదక్షిణ. అగ్నిహోత్రం చుట్టూగానీ, పూజ్యులైన వ్యక్తుల చుట్టూగానీ తిరగటాన్ని ప్రదక్షిణ అని మన ప్రాచీన శాస్త్రాలు చెబుతాయి. కాని, ఇప్పుడు వాటికి బదులు జడమూర్తుల చుట్టూ తిరుగుతున్నారు. 'మూర్తి' అనే పదము యొక్క మూలార్థం (మూర్ఛామోహసముచ్ఛ్రయోః) మూర్ఛితుడగుట, మోహితుడగుట, జ్ఞానరహితుడగుట" అని అర్థం. మనం అగ్నిహోత్రం చుట్టూ తిరిగితే హోమవాయువులవల్ల విశేషలాభం కలుగుతుంది. పూజ్యులైన వ్యక్తుల చుట్టూ తిరిగితే వారినుండి అన్నిరకాలుగానూ ప్రయోజనం పొందాలని సంకల్పించుకోవటం అవుతుంది. అయితే - ఇక్కడ మనసా పరిక్రమమంటే - కాళ్ళతో కాకుండా మనస్సుతో ప్రదక్షిణ చెయ్యటమని అర్థం. తాను స్థిరంగానే కూర్చుని మనస్సును ఒక క్రమపద్ధతిలో తన చుట్టూ త్రిప్పటమని భావం. మనకు నాలుగువైపులా (క్రిందా పైనా కూడా) సర్వవ్యాపక సర్వేశ్వరుడు వ్యాపించి ఉండి అనేకరకాలుగా మనను రక్షిస్తున్నాడని గుర్తించటం.

పరమేశ్వరుడు మనకొరకే ఈ అద్భుతాద్భుతమైన సృష్టిని నిర్మించాడు. ప్రాణుల రక్షణకే కొన్ని ప్రాకృతిక దేవతలను సృష్టించాడు. ఆ ప్రాకృతిక దేవతలన్నీ బాధలను పోగొట్టే బాణాలవంటివి. వీరులు దుష్టశిక్షణ శిష్ట రక్షణ చేసినట్లే దేవుడు మనను ఇబ్బందులనుండి, కష్టాలనుండి, బాధలనుండి రక్షిస్తున్నాడు. ఆ రాక్షసులను ప్రాకృతిక దేవతలనే బాణాలతో వెడలగొట్టి మనను కాపాడుతున్నాడు. ఆ బాణాలు మనను పాలిస్తాయి పోషిస్తాయి కూడా. సూక్ష్మదృష్టితో పరిశీలిస్తేనే ఈ విషయం అర్థం అవుతుంది. ఆ సూక్ష్మ విషయాలనే సంధ్యావందనంలో మనం పఠించే వేదమంత్రాలు చెబుతాయి. అంటే - సృష్టికర్తనే మనకు ఆ సూక్ష్మ విషయాలను వేదం ద్వారా ఉపదేశించాడు. ముందుగా మనం ఆ వేదమంత్రాలలోని సూక్ష్మ విషయాలను అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాము. అనంతరం అవి పతంజలి మహర్షి చెప్పిన యోగాంగాలలో 5వ అంగమైన ప్రత్యాహారం ఎలా అవుతాయో తెలుసుకుందాము.

## తూర్పు దిక్కున దేవుని రక్షణ ఏర్పాటు

ఓం ప్రాచీ దిగగ్నిరధిపతిః + అసితో రక్షితా + ఆదిత్యా ఇషవః = తూర్పు దిక్కున అగ్ని - ప్రకాశస్వరూపుడైన పరమేశ్వరుడు అధిపతిగా ఉండి, ప్రాణులు

అంధకారంలో పడి మ్రగ్గిపోకుండా 'ఆదిత్యుడు (సూర్యుడు)' అనే బాణంతో (ప్రకాశ కిరణాలనే బాణాలతో) చీకటి అనే రాత్రిని వెడలగొట్టి ప్రాణులన్నింటిని కాపాడుతున్నాడు. (అథర్వవేదం 3-27-1).

**వివరణ:** ఆదిత్యుడు (సూర్యుడు) తూర్పున ఉదయిస్తాడనే విషయం అందరికీ తెలిసినదే. తూర్పున ఉదయిస్తున్న సూర్యుడు పైపైకి ఎగబాకి మధ్యాహ్నం నుండి పడమటవైపు పయనిస్తూ పశ్చిమాన సముద్రంలో అస్తమిస్తున్నట్లు మనకు కనబడుతాడు. కాని, సూర్యుడు భూమిచుట్టూ తిరగటంలేదు. భూమి తనచుట్టూ తాను సెకనుకు 9 మైళ్ళ వేగంతో పడమట నుండి తూర్పువైపుకు తిరుగుచున్నది. అందుచే భూమిపైనున్న మనకు సూర్యుడు తూర్పున ఉదయించి పశ్చిమాన అస్తమిస్తున్నట్లు కనబడుతున్నది. ఈ విషయం మనకు ఖగోళ విజ్ఞానం ద్వారా తెలుస్తున్నదేకాని, సామాన్య కంటికి కనబడదు. రాకెట్‌లో పయనించే వ్యోమగాములకు భూమి తనచుట్టూ తాను తిరుగుతున్నట్లు ప్రత్యక్షంగా కనబడుతుందట.

ఆ విధంగా భూమి తన చుట్టూ తాను తిరుగుచుండుటవల్లనే భూమిపై ఉన్న ప్రాణులన్నింటికి సూర్యుడు కనబడతాడు. ఎప్పుడూ భూమిపై సగభాగం పగలుగాను, సగభాగం రాత్రిగాను ఉంటాయి. సృష్టికర్త చేసిన ఈ ఏర్పాటువల్ల ప్రాణులకు ప్రవృత్తి మరియు నివృత్తి (విశ్రాంతి) కలిగి అవి సుఖంగా జీవిస్తున్నాయి. ఈ రక్షణ ఏర్పాట్లను మిగిలిన ప్రాణులు సరిగా అర్థం చేసుకోలేకపోయినా బుద్ధిజీవులమైన మనకు బాగా ఉదయ అర్థమవుతుంది. సృష్టికర్తపై శ్రద్ధాభక్తులేర్పడతాయి. కనుక ప్రతి వ్యక్తి సాయంకాలాలలో సృష్టికర్తను స్మరిస్తూ మనం చాలా చాలా ధన్యవాదాలు చెప్పవలసి ఉంది. లేకుంటే మనం కృతఘ్నులమౌతాము. చేసిన, చేస్తున్న మేలును మరచిన వారమౌతాము. కృతఘ్నత కూడా పాపమే కదా! అందుకని మన ఋషులు ద్విజులైన వారంతా - అంటే విద్యావంతులంతా ఉదయ సాయంకాలాలలో సంధ్యావందనం విధిగా చేయాలనే నియమమేర్పరచారు. ఆ ప్రక్రియనే శాస్త్రాలు సంధ్యావందనమనీ, బ్రహ్మయజ్ఞమనీ అంటాయి. పై అథర్వవేద మంత్రంలోని మిగిలిన పాదములు ఆ ధన్యవాదాలు ఎలా చెప్పాలో నిర్దేశిస్తాయి.

## పై మంత్రంలోని తదుపరి పాదములు

**తేభ్యో నమో + అధిపతిభ్యో నమో, రక్షితృభ్యోనమ, ఇషుభ్యోనమ, ఏభ్యో అస్తు, యో + అస్మాన్ ద్వేష్టి - యం వయం ద్విష్మః + తం వో జంభే దధ్మః ॥**

- అథర్వవేదం (3-27-1)

అట్టి సర్వవ్యాపక సంరక్షకునికి మా నమస్సులు. తూర్పు దిక్కునకు అధిపతిగానున్న అతని ప్రకాశశక్తికి నమస్కారము. అతని అప్రతిహత రక్షణ శక్తికి నమస్కారము. అతని బాణరూప సూర్య కిరణములకు నమస్కారము. ఈ రక్షణ శక్తులన్నీ సదా మమ్ము కాపాడుచుండునుగాక!

ఎవరు మమ్ము ద్వేషించుచున్నారో, ఎవరిని మేము ద్వేషించుచున్నామో మమ్ములను అశాంతికి గురిచేయుచున్న అట్టి ద్వేషమును ఓ పరమేశ్వరా! నీ న్యాయరూప బాహువులకు అర్పించుచున్నాము. అత్యంత న్యాయకారివైన నీవే మాకు న్యాయం చేయుదువుగాక! మేము పరస్పర ద్వేషమును విడిచి సుఖశాంతులతో సామాజిక జీవనము గడుపుదుముగాక! అభ్యుదయ నిశ్శ్రేయసములు పొంద పూర్ణ పురుషార్థం చేయుదుముగాక!

వివరణ: నేడు మనం చూస్తున్న ఈ విశాల విశ్వం, భూమిపై ఏర్పడిన స్థావర జంగమ ప్రాణి సృష్టి అకస్మాత్తుగా గానీ, కాకతాళీయంగాగానీ, డార్విన్ చెప్పిన వికాసవాదంతోగానీ ఏర్పడినది కాదు. ఏదో అనంతజ్ఞానం, అనంత శక్తిసామర్థ్యాలు గల అదృశ్య శక్తి చేసినట్లుగా వివేకవంతులకు అర్థమౌతుంది. ఆ అదృశ్యశక్తినే మన ఆధ్యాత్మిక శాస్త్రాలు దేవుడు అంటున్నాయి. ఆ దైవం దయామయుడు కూడా. అందుకనే ప్రాణులకు అవసరమైన కనీస అవసరాలను, రక్షణ ఏర్పాట్లను సృజించిన తదుపరియే ప్రాణి సృష్టి చేశాడు. ఆ ప్రాణులలో సర్వోన్నత ప్రాణులుగా మానవ సృష్టి గావించాడు. వారికి జ్ఞానేంద్రియాలను, కర్మేంద్రియాలనేగాక బుద్ధి యనే అంతరింద్రియన్ని సృజించి యిచ్చాడు. ఏ మానవులు అంతరింద్రియామైన బుద్ధిని వికసింపచేసుకుంటారో, తర్కంతో పదును పెట్టుకుంటారో వారంతగా విజ్ఞానవంతులు వివేకవంతులు అవుతారు.

అట్టి బుద్ధిమంతులకు ప్రాథమిక జ్ఞానం కలిగించుటకే సృష్టి విజ్ఞానాన్నంతా వేదాలరూపంలో మానవులకు అందజేశాడు. ఆది మానవ సృష్టిసమయాననే జ్ఞాన గ్రహణ సామర్థ్యం గల నలుగురు ఋషుల హృదయాలలో నాలుగు వేదాలను ప్రకాశపరచాడు. అవే - ఋక్ యజుర్ సామ అథర్వ వేదాలు. పై మంత్రం అథర్వ వేదంలోని తృతీయకాండంలోని 27వ సూక్తంలోని మొదటి మంత్రం. 6 మంత్రాలు గల ఈ చిన్న సూక్తం తూర్పు (East), దక్షిణ (South), పడమర (West), ఉత్తర (North) అనే నాలుగు దిక్కులతోబాటు క్రిందివైపు, పైవైపులను కూడా దిక్కులుగా పరిగణించింది. ఏఏ దిక్కులలో సృష్టికర్త ఏఏ రక్షణ ఏర్పాట్లను సృజించాడో ఈ 6 మంత్రాలు మనకు చెబుతాయి. వీటి వెనుక చాలా విజ్ఞానం (Science) ఉంది. వాటిని మనం ఎంతగా మననంచేసి ఆలోచించి పరిశోధనలు చేస్తామో అంతగా మనకు భౌతిక విజ్ఞానం కలుగుతుంది. ఈ మొదటి మంత్రం మనకు తూర్పుదిక్కున ఉన్న రక్షణ ఏర్పాటును తెలిపింది. ఆదిత్యుని వల్లనే (సూర్యుని వల్లనే) అంధకారం (చీకటి) తొలగి ప్రాణులకు ప్రవృత్తి కలుగుతున్నదంటున్నది. అట్టి సృష్టికర్తకు, అతడు చేసిన రక్షణ శక్తులకు నమస్కరించమంటున్నది. ఇక్కడ 'నమః' అంటే గుళ్ళల్లో విగ్రహాలకు నమస్కరించినట్లు కాదు. వాయిద్యకారులు (ఆర్కెస్ట్రావారు) కచేరీ ప్రారంభించేముందు వారి వారి వాయిద్యాలకు నమస్కరించి ప్రారంభిస్తారు. అంటే అవి దేవుడని కాదు. వాటివల్లనే తమకు గౌరవ మర్యాదలు, ఆదర సత్కారాలు లభిస్తున్నాయి కనుక వాటిపట్ల సత్కారభావాన్ని వ్యక్తపరచటం కొరకు. అట్లే మనం సర్వవ్యాపక సర్వేశ్వరుడైన సృష్టికర్తకు నమస్కరించటంతోపాటు, ఆయన ఏర్పాటు చేసిన రక్షణ శక్తులను తగిన విధంగా గౌరవించమనీ, సత్కరించమనీ అర్థం.

ఈ విధంగా దక్షిణ, పశ్చిమ, ఉత్తర దిక్కులలోను పైనా, క్రింద కలిపి 6 దిక్కులేవాయి. 6 దిక్కులలోను పరమేశ్వరుడు తగిన రక్షణ శక్తులను ఏర్పాటు చేసి మననే రక్షిస్తున్నాడు. వివరాలకు నా రచనలు "సంధ్యావందనము వైజ్ఞానిక సమాలోచనము మరియు వేదార్థ విజ్ఞానం'' అనే పుస్తకాలలో చూడగోరుచున్నాను.

మనం లోకం 'మూర్తీభవించిన ధర్మము'గా భావించే శ్రీరామునకు, అతని బాహువులకు, ధనుర్బాణాలకు మా సమస్సులు. రామబాణానికి తిరుగు లేదు. 'రామబాణానికి జై' అంటాము కదా! అట్లే దేవునికి, దేవుని శక్తులకు, అతని బాణాలకు 'నమః' అంటున్నాము.

చివరిగా మరొకమాట. ఆయా దిక్కులకు మనస్సుతో తిరగాలి కాని శరీరంతో కాదు. 'నమః' కేవలం హృదయ పూర్వక మనసులకే కాదు. నమః అనే పదములో అన్నము, దండనము మొదలైన మరికొన్ని అర్థాలు కూడా ఉన్నాయి. ప్రకరణాన్ని బట్టి అందుకు తగిన అర్థాన్ని తీసుకొని ఉపయోగించుకోవాలి.

పతంజలి మహర్షి వ్రాసిన యోగదర్శనంలోని 'ప్రత్యాహారం' పదముకూడా ఇదే నిర్దేశిస్తున్నది. తాను స్థిరమైన ఆసనంలో, స్థిరంగా కూర్చొని పలుమార్లు బయటకు పరుగులెత్తుచున్న మనస్సుకు నచ్చ చెప్పుకుంటూ ప్రతీచోట సర్వవ్యాపక సర్వేశ్వరుడు నిండుగా ఉన్నాడని తలుస్తూ ధ్యానించాలి. కనుక అట్టి పరమేశ్వరుని పరమానంద స్వరూపాన్ని దర్శించాలంటే అంతర్ముఖులమై ఆత్మ పరమాత్మల దర్శనం చేయక తప్పదు. అప్పుడే సర్వదుఃఖ నివృత్తిరూప ముక్తి కలుగుతుంది. త్రిలోకాలను దాటి దేవుని తృతీయధామంలో స్వేచ్ఛగా కోట్లానుకోట్ల సంవత్సరాలు విహరించవచ్చు. 'నాన్యః పంథా విద్యతే + అయనాయ' (యజు.31-18). వేరే మార్గం లేనే లేదంటుంది, వేదం. మనమును అట్లే చేద్దాము.

# 7. "అగ్నిమీళే పురోహితమ్"

ఓం అగ్నిమీళే పురోహితమ్, యజ్ఞస్య దేవమృత్విజమ్,
హోతారం రత్నధాతమమ్ ॥ - ఋగ్వేదం (1-1-1)

**వాక్యార్థం: అగ్నిమీళే పురోహితమ్ =** ఓ అగ్నినామక సర్వవ్యాపక సర్వేశ్వరా! ముందుగా వేము నిన్నే మా హృదయంలోనికి (మనస్సులోనికి) ఆహ్వానిస్తున్నాము. ఎందుకనగా నీవు పురోహితుడవు. మేము కోరకముందే సృష్టిలో మా కవసరమైన వస్తువులన్నింటిని సృష్టించిన సృష్టికర్తవు. సృష్టి స్థితి ప్రళయాలు మూడింటికీ నీవే ఏకైక కర్తవు.

**యజ్ఞస్య దేవమ్ ఋత్విజమ్ =** ఈ సృష్టిరూప మహా యజ్ఞాన్ని నిర్వహించుచున్న ఏకమాత్ర ఋత్విజుడవు కూడా నీవే. నీ కెవరి సహాయ సహకారాలు అవసరంలేదు. నీవు సర్వశక్తిమంతుడవు. అనేకానేక దివ్య గుణాలు, కర్మలు, స్వభావాలు కలవాడవు. అట్లే ఈ ప్రాకృతిక దేవతల కన్నింటికి దివ్యగుణాల నిచ్చుచున్నదియును నీవే. నీ సహకార పోషణలు లేకుండా అవి ఏమీ చేయలేవు. అవి జడములు. జ్ఞానం లేనివి. సృష్టిలో ఋతుక్రమాన్ని ఏర్పాటుచేసి సృష్టిని నిత్యనూతనంగా చేయుచున్నదియును నీవే. కనుక నీవు ఋత్విజుడవు.

**హోతారం రత్న ధాతమమ్ =** ఓ పరమేశ్వరా! నీవు హోతవు. కర్మఫలదాతవు. సర్వాంతర్యామివైన నీవు మేము మా మనోవాక్కాయాలతో చేసే వివిధ కర్మలకు అత్యంత న్యాయంగా ఫలాలనిచ్చు న్యాయదేవతవు. ఇట్టి అనేకానేక శుభగుణ రత్నాలను ధరించినవాడవు.

**భావార్థం:** నేను ఈ శుభకార్య ప్రారంభంలో సృష్టిరూప మహాయజ్ఞాన్ని నిర్వహించుచున్న పరమాత్మను వైదిక స్వస్తివాచన మంత్రాలతో స్తుతించుచున్నాను. ఆ పరమాత్మ నా ఈ శుభకార్యాన్ని ఆశీర్వదించునుగాక. సఫలము చేయునుగాక!

ఓ అగ్నీ! జ్ఞాన ప్రకాశస్వరూప పరమాత్మా! నీవు పురోహితుడవు. మేము కోరకముందే మాకు హితాన్ని కలిగించు దేవుడవు. యజ్ఞ స్వరూపుడవు. నీ

స్వరూపమే యజ్ఞమయము. ఇట్టి అనేకానేక శుభగుణ రత్నాలను ధరించిన సర్వాధారుడవు. నీ అసలు నామము ఓమ్. కనుక మేము ముందుగా నిన్నే మాలోనికి ఆహ్వానించుచున్నాము.

**వివరణ:** వేదాలలో మొదటిదైన ఋగ్వేదం అగ్నిపదముతోనే పైపదముతోనే ప్రారంభమౌతుంది. ఈ మంత్ర ఋషియును 'అగ్ని' నామధేయుడే. సృష్టికర్తయైన పరమేశ్వరుడు ఈ ఋషి హృదయంలోనే ఋగ్వేదాన్ని ప్రకాశపరచాడు. అగ్నిపదము 4 వేదాలలోను కొన్ని వందల మంత్రాలలో కనబడుతుంది. అట్లని అన్నిచోట్లా అగ్నిపదము పరమాత్మకే వర్తించదు. ప్రకరణాన్నిబట్టి - ప్రసంగాన్నిబట్టి మరికొన్ని అర్థాలుంటాయి.

అగ్ని పదము **"అఞ్చు- గతి పూజనయోః"**అనే సంస్కృత మూల ధాతువుతో నిర్మించబడుతుంది. కనుక 'గతి కలిగినది, పూజించదగినది' అని మూలార్థం. ఇంతేగాక, గతిలో 3 అర్థాలుంటాయన్నారు మన ఋషులు.

**"గతిః త్రయో అర్థాః జ్ఞానం, గమనం ప్రాప్తిశ్చేతి"** అన్నారు. ఇంతేగాక - **"పూజనం నామ సత్కారంః, యోఽఞ్చతి అచ్యతేఽ గత్యం గత్యేతి వా సోఽయమగ్నిః"** అని కూడా వివరించారు. అంటే - జ్ఞానపూర్వకమైన గమనంతో లక్ష్యంవైపు నడిపించి ప్రాప్తించవలసినదానిని ప్రాప్తింపచేసేదానిని గతి అంటారని అర్థం. పూజనం అంటే పసుపు కుంకుమలతో పూజించటం కాదు. సత్కరించటమని అర్థం. వారిని గౌరవించటం, వారి ఆజ్ఞలను శ్రీరామునివలె నిజజీవితంలో ఆచరించటాన్ని సత్కారం అంటారు. పరమేశ్వరునిలో ఈ మూడు గుణాలు అనంతంగా ఉంటాయి. కనుక మనం పూజించవలసినవారిలో అందరికన్న ముందుగా పేర్కొనవలసింది పరమేశ్వరునే కదా! అందుచే ఈ మంత్రంలో పరమేశ్వర పరంగా ఆధ్యాత్మికార్థంగా 'అగ్ని' అంటే పరమేశ్వరుడని చెప్పబడింది.

ఇదే అగ్నిపదము ఆధిభౌతికార్థంలో మాతా పితరులకు ఆచార్యులకు, విద్వాంసులకు, రాజుకు, నాయకులకు, సేనాపతులకు ఆ ప్రకరణాన్నిబట్టి వర్తింప చేయవచ్చును. ఇక ఆధిదైవికార్థంలో అగ్నిపదము అగ్నిహోత్రానికి, సామాన్యాగ్నికి, వైశ్వానరాగ్నికి, జఠరాగ్నికి వర్తిస్తుంది. అందుచేతనే దయానంద

మహర్షి తమ ఋగ్వేద భాష్యంలో పైన వివరించిన ఆధ్యాత్మికార్థంతోబాటు రెండవ అర్థంగా సామాన్యాగ్ని పరంగా కూడా భాష్యం వ్రాశారు. "వేదాలు అనేకార్థ బోధకాలు" అనే ఆలోచనల విశాలతకు దారి చూపించారు. దీనికి వారు వ్రాసిన అర్థాన్ని కూడా ఇక్కడ సంక్షిప్తంగా తెలుసుకుందాము.

## ఆధిదైవికార్థం (వ్యావహారికార్థం)

1. **(అగ్నిమ్ + ఈళే పురోహితమ్)** = భౌతికాగ్నిలో అనేకానేక గొప్ప గుణాలుండుట వల్లను, దానివల్ల నిత్యజీవితంలో చాలా అవసరాలుండుట చేతను నేను అగ్నిని కీర్తిస్తున్నాను. అది పురోహితుడు కూడా - ఆహార పదార్థాలను వండుకోవటానికి ముందుగాను, ఖనిజాలను కరిగించి పనిముట్లుగా, సాధనాలుగా చేసుకోవటానికి ముందుగాను అవసరమయ్యేది అగ్నే కదా! అందుకని అది పురోహితుడు.

2. **(యజ్ఞస్య దేవమ్ + ఋత్విజమ్)** = దేవ యజ్ఞమైన అగ్నిహోత్రానికి అగ్ని ప్రథమ దేవత. ఇంతేగాక, నెయ్యి, హోమద్రవ్యాలను జీర్ణంచేసేది-అంటే సూక్ష్మం చేసి గాలిలో కలిపి మిగిలిన జడదేవతలన్నింటికి అందచేసేది అగ్నే కదా! కనుక అది యజ్ఞ దేవత. ఋత్విజమ్ = ఆ యా ఋతువులకు అనుకూలంగా అగ్నితో (విద్యుత్తుతో) తగిన యంత్రాలను నిర్మించుకోవచ్చును. కనుక అది ఋత్విజుడు.

3. **(హోతారం రత్నధాతమమ్)** = అది మనకు ఎన్నెన్నో సుఖసాధనాలనిస్తున్నది కనుక అది హోత కూడా. ఇట్టి అనేక శుభగుణ రత్నాలను ధరించి ఉంది అగ్ని. వీటిని పరిశోధించి తెలుసుకోవలసి ఉంది.

ఇక ఆధిభౌతికార్థం గురించి ఆలోచిద్దాము. ఇచ్చట ఆధిభౌతికార్థం అంటే పంచభూతాలపరంగా అని కాదు. తోటి ప్రాణులపరంగా అని అర్థం. మనం పూర్వం చెప్పుకొన్నట్లు అగ్నిపదము భౌతికార్థంలో రాజుకు, నాయకునకు మొదలగువారికి వర్తించేవిధంగా చెప్పుకుందాము.

**1. (అగ్నిమ్+ఈళే పురోహితమ్)** = మమ్ము సరియైన మార్గంలో నడిపించే ఓ రాజా! ఓ నాయకా! ముందుగా నిన్ను కీర్తిస్తున్నాము. ఏలనంటే - నీవు పురోహితుడవు. మేము కోరకముందే మా హితము కొరకు రకరకాల పథకాలు వేసి మమ్ము పురోగతివైపు తీసుకుపోయే నాయకుడవు.

**2. (యజ్ఞస్య దేవమ్ ఋత్విజమ్)** = నీవు రచించు పథకాలన్నీ యజ్ఞాలే - పరోపకారం కొరకే. కనుక నీవు యజ్ఞదేవుడవు. ఆ యా ఋతువులలో కలిగే ఇబ్బందులనుండి ఉపశమనం పొందుటకు, అందుకు తగిన గృహాలను, వస్త్రాలను, ఆహారాదులను సమకూర్చి ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడు ఋత్విజుడవు. ఇంతేగాక ప్రకృతి వైపరీత్యాలైన తుఫానులు, వరదలు, భూకంపాలు, అతివృష్టి, అనావృష్టి మొదలైనవాటిని నివారించగల అశ్వమేధ, గోమేధ, వర్షేష్టి వంటి పెద్ద పెద్ద యజ్ఞాలను నిర్వహించునదియు. నీవే. కనుక నీవు ఋత్విజుడవు కూడా.

ఇక్కడ అశ్వమేధం అంటే అశ్వాన్ని వధించి అగ్నిహోత్రంలో ఆహుతులివ్వటంకాదు. **"రాష్ట్రం వై అశ్వః"** అంటుంది శతపథ బ్రాహ్మణం. మేధ అంటే చంపటంకాదు. ఉన్నతిని కలిగించటం. రాష్ట్రం అంటే దేశంలోని చిన్న చిన్న రాష్ట్రాలనికాదు. వైదిక పరిభాషలో రాష్ట్రం అంటే దేశం అని అర్థం. కనుక దేశ సంక్షేమం కొరకు చేసే పెద్ద యజ్ఞాన్ని అశ్వమేధం అంటారు. అట్లే గోమేధ అంటే ఆవుని చంపి అగ్నిలో ఆహుతులివ్వటంకాదు. గో అనే పదములో గోవులు, భూమి మొదలగు మరికొన్ని అర్థాలుంటాయి. ఇక్కడ 'భూమి' అనే అర్థాన్ని గ్రహించాలి.

ఏ కారణంచేతనైన భూమి ఊసర క్షేత్రమైతే, నిర్వీర్యమైతే దానిని మరల ఉర్వరక్షేత్రంగా - పంటలు పండే భూమిగా తయారుచేసే పథకం. అందుకు ఆ క్షేత్రంలో వర్షేష్టి మొదలైన పెద్ద పెద్ద యజ్ఞాలు చేస్తూ సారవంతం చేయ యత్నించటమే గోమేధం.

**3. హోతారం రత్నధాతమమ్** = ఓ రాజా! నీవు హోతవు. ప్రజలమైన మాకు ఎన్నెన్నో సౌకర్యాలు కల్పిస్తున్నావు. విద్య వైద్య వ్యవసాయ రక్షణాదులను ఏర్పాటు చేశావు. ఇంతేగాక, మరెన్నో సద్గుణ రత్నాలను కలిగివున్న నిన్నే ముందుగా మేము కీర్తించుచున్నాము.

ఈవిధంగా పై మంత్రానికి ఆధిభౌతికార్థం చెప్పవచ్చు. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికాలనే 3 అర్థాలే కాకుండా అగ్నిహోత్రపరంగానూ అర్థం

చెప్పవచ్చునంటారు కొందరు విద్వాంసులు. దానిని వారు ఆధియాజ్ఞిక అర్థం అన్నారు.

## ఆధియాజ్ఞికార్థం:

అగ్నిమీళే **పురోహితమ్** = ఓ యజ్ఞాగ్నీ! ముందుగా మేము నిన్నే కీర్తించుచున్నాము. ఏలనన, నీవు పురోహితుడవు. మేము కోరకముందే మా హితమును కోరువాడవు.

**యజ్ఞస్య దేవమ్** = నీవు యజ్ఞదేవతవు. సృష్టిలోని ఏ దేవతకు మేము ఆహుతులర్పించాలన్నా, ముందుగా నీకే అర్పించవలసి ఉంటుంది. నీవు వాటిని జీర్ణం చేసినప్పుడే - అణు పరమాణువులుగా మార్చినప్పుడే మిగతా దేవతలు స్వీకరించగలవు. నీవు ముందుగా వాటిని సూక్ష్మీకరించి వాయుదేవతకు అర్పిస్తావు. ఆ వాయుదేవత అన్నివైపులకు వ్యాపించి అన్ని దేవతలకు అందజేస్తుంది. కనుక నీవు యజ్ఞదేవతవు.

**హోతారం రత్నధాతమ్** = నీవు హోతవు కూడా. మేము నీ కర్పిస్తే, నీవు వాటిని మిగిలిన దేవతల కర్పిస్తున్నావు. ఇట్టి అనేకానేక శుభగుణము లనే రత్నాలు నీయందుండుట చేతనే నిన్ను మేము 'రత్నధాతమమ్' అని కీర్తిస్తున్నాము. శుభమస్తు- ఈ విధంగా 3,4 రకాలుగా చాలా వేదమంత్రాలకు అర్థాలు చెప్పవచ్చునంటారు వేద విద్వాంసులు. అందరకు శుభమగునుగాక!.

## 8. మనిషికి జీవితేచ్ఛ అవసరం

**మం॥ ఇంద్ర మృళ మహ్యం జీవాతుమిచ్ఛ ।**
**చోదయ ధియమయసో న ధారామ్,**
**యత్ కిం చాహం త్వాయురిదం వదామి తజ్జుషస్వ**
**కృధిమా దేవవన్తమ్ ॥** - ఋగ్వేదం (6-47-10)

ఓ ఇంద్ర! పరమైశ్వర్య ప్రదాతా! దయతో నాకు ధర్మసాధన చేయ జీవితేచ్ఛను ప్రసాదింపుము. జ్ఞాన సాధనమైన నా బుద్ధిని ఖడ్గహధారవలె పదునుపెట్టి నీ వేదజ్ఞానాన్ని గ్రహించ సమర్థుని చేయుము. నీ తృతీయ ధామమును చేరగోరు నాకు అవసరమగు యమనియమాది అష్టాంగముల సిద్ధిని ప్రాప్తింపజేయుము. నన్ను దివ్యగుణయుక్తిని చేసి నీదరి చేర్చుకొమ్ము.

### ఇంద్రమృళ మహ్యం జీవాతుమ్ + ఇచ్ఛ

లోకంలో జీవునికి మానవజన్మ దొరకటం దుర్లభమని ఋషులు, ఆచార్యులు, మహాత్ములు అన్నారు. ఆది శంకరాచార్యులవారేమన్నారంటే -

**శ్లో॥ దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహహేతుకమ్ ।**
**మనుషత్వం ముముక్షత్వం మహాపురుష సంశ్రయః ॥**

-వివేకచూడామణి

"మానవ జన్మ రావడం, ముక్తి పొందాలనే తీవ్రేచ్ఛ కలగడం, మహా పురుషుల సాంగత్యం దొరకడం అనే 3 విషయాలు మనకు లభించడం చాలా దుర్లభమైన సంఘటనలు. ఇవి దైవానుగ్రహంవల్ల మాత్రమే లభిస్తాయి" అన్నారు.

కనుక మనం ఈ మానవ శరీరాన్ని యుక్తాహార విహారాల ద్వారా జాగ్రత్తగా కాపాడుకుంటూ ఎక్కువకాలం జీవించాలని కోరుకోవాలి. అందుకొరకు పూర్ణ పురుషార్థం చెయ్యాలి. అందుకొరకే ఆయుర్వేద శాస్త్రాలు వ్రాయబడ్డాయి. వాటన్నింటిలోను 'స్వస్థవృత్తం' అనే పేరుతో మొదటి అధ్యాయాలు వ్రాయబడ్డాయి. వాటిలో ఆరోగ్యంగా బలంగా దీర్ఘకాలం జీవించాలంటే చక్కటి దినచర్యను, ఋతుచర్యను జరుపుకోవాలని

ఉపదేశించారు. ఆ వివరాలు అందులో పొందుపరచారు. కనుక ప్రతీవ్యక్తీ ఆ స్వస్థవృత్తాన్ని తప్పక చదవాలి. ఆలోచించాలి. తెలియకుంటే తెలిసినవారి నడిగి తెలుసుకోవాలి. తగిన వ్యాయామము, ప్రాణాయామము కూడా తప్పక చెయ్యాలి.

ఇచట ముఖ్యంగా మరొక విషయం కూడా మనం గుర్తించాలి. ఎక్కువకాలం జీవించాలనే కోరిక ఉన్నప్పుడు అందుకు తగిన జీవికను - ఆర్థిక వ్యవస్థను ఏర్పాటు చేసుకోవాలి. ఎంత జాగ్రత్తగా ఉన్నా కొన్ని ఆగంతుక వ్యాధులు రావచ్చు. అవి రాకున్నా వృద్ధాప్యం అందరికి వస్తుంది. కనుక దానిని కూడా దృష్టిలో పెట్టుకొని తగిన వ్యవస్థ చేసుకోవాలి.

లోకంలో అన్నీ సుఖాలే లేవు, కొన్ని కష్టాలు కూడా వస్తాయి. అందుకు మనం మానసికంగా బలపడాలి. ఆధ్యాత్మిక గ్రంథాలు చదువుతూ స్థితప్రజ్ఞత్వాన్ని బలపరచుకోవాలి. కష్టాలలో కృంగిపోక, సుఖాలలో పొంగిపోక అన్నిటిని సహించాలి. ఎన్ని కష్టాలు వచ్చినా ఆత్మహత్యా ప్రయత్నం అసలు చెయ్యకూడదు. పరమేశ్వరుడు ప్రసాదించిన మానవ శరీరాన్ని పోగొట్టుకోకూడదు. అలాచేస్తే మరికొంత పాపం మనను చుట్టుకొంటుంది. పూర్వ (మానవ) జన్మలలో మనం చేసిన పాపకర్మలే మనకు నేడు కష్టాల రూపంలో వస్తున్నాయి. దానికి ఆత్మహత్యా పాపం కలిస్తే వచ్చే జన్మలో మరిన్ని కష్టాలు వస్తాయి. కనుక ఆ తలంపే రానీయవద్దు. కొందరు యువావస్థలోనే చిన్న చిన్న కారణాలతో ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. పరీక్షలలో ఫెయిలయ్యామనో, అనుకున్న ర్యాంకు రాలేదనో, ప్రేమ విఫలమయ్యిందనో, ఆత్మీయులు దూరమయ్యారనో ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఇది ఎంతమాత్రం మంచిదికాదు. ప్రపంచ ప్రసిద్ధ వైజ్ఞానికులు, మేధావులు, మహాత్ములు కూడా చిన్న వయస్సులో ఎన్నో కష్టాలు, ఓటములు చవిచూసినవారే. కనుక ఆశావాదులుగా పోరాడటమే ఉత్తమం. ఈ విషయమే ఈశ్వరీయ జ్ఞానమైన వేదం "ఇన్ద్రమృళమహ్యం జీవాతుమ్+ఇచ్ఛ" ఓ పరమేశ్వరా! నాకు జీవితేచ్ఛను (చాలాకాలం జీవించాలనే కోరికను) కలిగించు. దానితోబాటు అందుకు తగిన వివేకబుద్ధిని ప్రసాదించుమని ప్రార్థించమంటుంది.

# "చోదయ ధియమయసో న ధారామ్"

ఓ పరమేశ్వరా! నా బుద్ధిని యుద్ధఖడ్గంవలె పదునుపెట్టు (షార్ప్ చెయ్యి). నాకు కుశాగ్రబుద్ధిని, వివేకబుద్ధిని కలిగించు. ఆత్మజ్ఞానాన్ని, ఆత్మబలాన్ని ప్రసాదించు అనియును ప్రార్థించాలంటుంది వేదం.

సృష్టిలో బహుమూల్య వస్తువు బుద్ధి. ఇది సృష్టికర్త మానవులకిచ్చిన గొప్ప వరం. బుద్ధితోనే మానవుడు విద్యా విజ్ఞానరంగాలలో ఉన్నత శిఖరాలకు చేరుకుంటున్నాడు. మానవాభ్యుదయానికి ఇది అనివార్యమైన వస్తువు. ప్రతీ వ్యక్తికీ కొద్దో గొప్పో బుద్ధి ఉంటుంది. ఎవరు దానిని పదును పెట్టుకుంటారో వారికే ఉన్నతి కలుగుతుంది. ఆలసులకు అది లభించదు. శరీరాలు (జన్మలు) మారతాయేకాని మనోబుద్ధులు మారవు. అవి జీవులవెంట వెళ్ళి మరొక శరీరంలో ప్రవేశిస్తాయి. పూర్వ జన్మలలో సాధన చేసి ఉన్నవారు ఈ జన్మలో అలవోకగా జ్ఞానవంతులౌతున్నారు. ఉన్నతి చెందుతున్నారు. ఒకవేళ మన బుద్ధి వెనుకబడిఉంటే నిరుత్సాహపడనక్కరలేదు. పట్టుదలతో సాధన చేస్తే ఈ జన్మలో ఎంతో కొంత ఉన్నతి కలుగుతుంది. మనం చేసిన సాధన సంస్కారంగా మారి మన బుద్ధిలో స్థిరపడుతుంది. అది వచ్చే జన్మలో మనకు సహకరిస్తుంది.

అయితే మానవ జీవితం కేవలం భౌతిక అభ్యున్నతి కొరకే కాదు. అది మనను నిశ్శ్రేయసంవైపు నడిపించాలి. అలా చేయకుంటే ఆ బుద్ధివల్ల మనకు పెద్దగా ప్రయోజనం కలుగదంటారు మన ఋషులు. నిశ్శ్రేయసం అంటే విశిష్ట ప్రయోజనం - గొప్పలాభం. త్రివిధ దుఃఖాల అత్యంత నివృత్తి. బ్రహ్మానందప్రాప్తి, జన్మరాహిత్యం. దానినే సంక్షిప్తంగా ముక్తి అన్నారు. త్రివిధ దుఃఖ అత్యంత నివృత్తియే - ముక్తియే పరమ పురుషార్థమన్నారు. కపిల మహర్షి తమ సాంఖ్యదర్శనంలో (అథ త్రివిధ దుఃఖ + అత్యంత నివృత్తిర్ + అత్యంత పురుషార్థః (సాంఖ్య. 1-) అని యన్నారు.

నేటి విద్యాక్షేత్రంలో జరుగుతున్న పెద్ద పొరబాటు ఇదే. అన్ని బడులు, కళాశాలలు, యూనివర్సిటీలు మానవుల అభ్యున్నతికి కృషి చేస్తున్నాయేకానీ నిశ్శ్రేయసంవైపు నడిపించుటలేదు. అందుచేతనే పెద్ద పెద్ద వైజ్ఞానికులు,

ఇంజనీయర్లు, డాక్టర్లు, ఐఏఎస్ ఆఫీసర్లు కూడా మూఢనమ్మకాల ప్రవాహంలో కొట్టుకుపోతున్నారు. తమ బుద్ధిని ఆధ్యాత్మిక విషయాలలో ప్రవేశపెట్టుటలేదు. దేవుడొక్కడే ఉంటాడని మన వేద శాస్త్రాలు ఘోషిస్తున్నా అనేక దేవీ దేవతలను కల్పించుకొని ఆరాధిస్తున్నారు. ఏ దేవుని ఆరాధించకపోతే ఏమి నష్టం కలుగుతుందోనని భయపడిపోతున్నారు. తమ సమయాన్ని ధనాన్ని వ్యర్థంగా ఖర్చు పెట్టుకుంటున్నారు. ఇవి చూస్తున్న ఒక మేధావి వర్గం నాస్తికులుగా మారిపోతున్నారు. మన యువకులను వారివైపు ఆకర్షించుకుంటున్నారు. క్రమంగా ఇది నాస్తిక సమాజమైపోతుందేమోనని కొందరు భయపడుతున్నారు.

అనేక దేవీ దేవతల ఆరాధనకు, సంప్రదాయాలకు, నవగ్రహారాధనకు, ఫలిత జ్యోతిష్యాలకు, కల్పిత వాస్తులకు కారణం పురాణాలు, క్షేత్రపురాణాలు మాత్రమే. ఈశ్వరీయ జ్ఞానమైన వేదాలలోగానీ, బ్రాహ్మణ ఆరణ్యకాది దర్శన ఉపనిషాదులలోగానీ ఇవేమీ లేవు. చరిత్ర గ్రంథాలైన వాల్మీకి రామాయణ, వ్యాసభారత, రఘువంశాది గ్రంథాలలో కూడా ఇవేవీలేవు. పురాణాలు వ్యాస మహర్షి వ్రాసినవి కావు. అవన్నీ సంప్రదాయ సంస్కృత పండితులు వ్రాసినవే. వాటిని తమ పేరుతో వ్రాసుకుంటే ప్రజలకు నమ్మకం కలుగదని వ్యాస మహర్షిని వాడుకున్నారు. వేదాంత దర్శనం వ్రాసిన వ్యాసమహర్షి ఇట్టి పుక్కిటి పురాణాలు వ్రాస్తాడా? వాటిని వేదాంత దర్శనంతో పోల్చి చదవండి. ఆ విషయం మీకే అవగతమౌతుంది.

## కృధి మా దేవవన్తమ్
## (నన్ను దివ్యగుణయుక్తుని చేసి నీ దరి చేర్చుకొమ్ము)

**యత్ + కిం + చ + ఇదం వదామి, తత్ జుషస్వ,**
**కృధి మా దేవవన్తమ్ ॥** - ఋగ్వేదం (6-47-10)

"యత్ కించాహం త్వాయురిదం వదామి తత్ జుషస్వ = నిన్ను చేరగోరు నాకు కావలసిన సాధనములన్నియు సమకూర్చుము" అని ప్రార్థించమంటుంది వేదం. ఆత్మ పరమాత్మల సాక్షాత్కారాన్ని పొంది దేవుని తృతీయధామానికి చేరుకోవటానికి ఏకైకమార్గం అష్టాంగయోగం. దీని వివరణ మనకు పతంజలి మహర్షి రచించిన యోగదర్శనంలో కనబడుతుంది. వివరంగా తెలుసుకోగోరువారు ఆ దర్శనశాస్త్రం చదువక తప్పదు. ఇచట చాలా

సంక్షిప్తంగా మాత్రమే వ్రాయబడుతున్నాయి. ఆ 8 అంగములు ఏవేవి అంటే-

**యమ నియమ + ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యాన సమాధయోఽ ష్టావంగాని** (యోగదర్శనం 2-29)

1. **యమములు (5): "అహింసాసత్యమస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహో యమాః"** యో.ద.2.30 (1) ఏ ప్రాణిని మనోవాక్కాయాలతో హింసించకుండా ఉండటం, (2) సదా సత్యాన్నే పలకటం, (3) ఎవరి వస్తువులను దొంగిలించకుండా ఉండటం, (4) సంతానార్థం మాత్రమే తన భార్యయందు సంగమించటం. మిగతా సమయాలలో వీర్యాన్ని ఓజస్సుగా మార్చుకుంటూ బ్రహ్మచర్య వ్రతాన్ని పాలించటం, (5) తన అవసరాలకు మించిన వస్తువులను, ధనాన్ని కూడపెట్టకుండా ఉండటం-అనే ఈ అయిదింటిని యమము లంటారు.

2. **నియమాలు (5): "శౌచ సంతోష తపః స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః"** (యో.ద. 2-32)

(1) బాహ్యాంభ్యంతరాలలో శుచిగా ఉండటం, (2) ఉన్నదానితో సంతృప్తిపడి సదా సంతోషంగా ఉండటం, (3) మోక్షం వైపు నడిపించే సద్గ్రంథాలను అధ్యయనం చేస్తూ ఉండటం, (4) కష్ట సుఖాలలో, మానావమానాలలో, హాని లాభాలలో విచలితులు కాకుండా తపఃశీలురు కావటం - ఓర్చుకోవటం, (5) తనుమనోవాక్కాయాలతో చేసిన సత్కర్మల ఫలాన్నంతా పరమేశ్వరార్పణ చేస్తూ పరమేశ్వరప్రాప్తియే పరమలక్ష్యంగా జీవితాన్ని గడపటం.

3. **ఆసనము:** స్థిరంగా సుఖంగా చాలాకాలం కూర్చోగలిగే దానిని ఆసనం అంటారు.

4. **ప్రాణాయామం:** యోగ్యులైన గురువుల దగ్గర ప్రాణాయామం నేర్చుకొని, దానిని ఉదయ, సాయం సంధ్యా సమయాలలో ఆచరించటం. ముఖ్యంగా యోగాభ్యాసం చేసేటప్పుడు తప్పకుండా కొద్దిసేపు ప్రాణాయామం చెయ్యాలి.

5. **ప్రత్యాహారం:** మనస్సును ప్రాపంచిక విషయ చింతనలనుండి మరలించి పరమేశ్వర గుణగణాల చింతనవైపు మరలించుట ప్రత్యాహారం అంటారు. ఇందుకు సంధ్యావందనంలోని మనసా పరిక్రమ మంత్రాలను

అర్థసహితంగా ఆ యా దిక్కులకు మనస్సును ప్రసరింపజేస్తే మనస్సు భగవంతునివైపు మరలుతుంది.

6. ధారణ: ఏకాంతమున ఆసనబద్ధులై కళ్ళు మూసుకొని మనస్సును మన శరీరంలోనే ఒకచోట నిలపటాన్ని ధారణ అంటారు. హృదయము, భృకుటి, కంఠము ఇందుకు అనుకూలంగా ఉంటాయి.

7. ధ్యానము: ధారణ చేసిన చోటనే మనస్సును నిలిపియుంచి పరమేశ్వరుని అనేక నామములలో మీకిష్టమైన ఒక నామమును తీసుకొని దానిని అర్థభావనతో జపించటాన్ని ధ్యానం అంటారు.

అయితే ఒక విషయంలో పొరబడకూడదు. నేడు లోకంలో పౌరాణికులు దేవుని ఒక్కొక్క నామానికి ఒక రూపాన్ని, ఒక చరిత్రను వ్రాసిపెట్టారు. వాటిని చింతించటం ధ్యానం కాదు. నామమునకు మూలార్థాన్నే గ్రహించాలి. అందుకనే ఉపనిషత్తు దర్శనాలు 'ఓం' కారాన్ని జపించటం ఉత్తమం అంటాయి.

'ఓం' అంటే సర్వ సంరక్షకుడని అర్థం. అప్పుడు ఏ రూపము మనస్సులోనికి రాదు. సర్వవ్యాపకమైయున్న ఒక మహత్తరశక్తి నన్ను అన్నివిధాలా కాపాడుతున్నదనే భావన కలుగుతుంది.

8. సమాధి: ధ్యానం పరిపక్వమైనప్పుడు మనస్సు నిశ్చలమౌతుంది. గొప్ప ఆనందం కలుగుతుంది. క్రమంగా అభ్యాసం పరిపక్వమైనప్పుడు ఆత్మ పరమాత్మల సాక్షాత్కారమౌతుంది. ప్రారబ్ధం పూర్తయిన తదుపరి జన్మరాహిత్యం కలిగి, పరమాత్ముని తృతీయ ధామానికి చేరుకుంటారు.

ఈ మంత్రం ఏమి చెబుతున్నదంటే -

"ఓ పరమేశ్వరా! హృదయపూర్వకంగా నిన్ను చేరగోరు నాకు ఈ అష్టాంగములు చక్కగా సిద్ధింపచెయ్యి. యోగ విఘ్నాలన్నింటిని తొలగించి నన్ను దివ్యగుణయుక్తుని చెయ్యి"మని ప్రార్థించమంటుంది.

ఈ సందర్భంలో యోగవిఘ్నాలంటే ఏమేమిటో కూడా తెలుసుకుందాము. పతంజలి మహర్షి ఏమన్నారంటే -

**వ్యాధిస్త్యానసంశయప్రమాదాఽలస్యావిరతిభ్రాన్తిదర్శనాలబ్ధ భూమికత్వాన వస్థితత్వాని చిత్త విక్షేపాః తేఽన్తరాయాః ॥** - యోగదర్శనం (1-30)

1. వ్యాధి: ఏదైనా వ్యాధివల్ల అష్టాంగములలో కొన్ని ఆచరించలేకపోవుట.

2. స్త్యానమ్: కోరికయున్నను అందుకు తగిన సామర్థ్యం లేకపోవటం.

**3. సంశయః:** యోగాభ్యాసము తనకు సాధ్యమౌతుందో లేదోనని శంకించటం-సందేహించటం.

**4. ప్రమాదః:** కొన్నిరోజులు చేసి విరమించటం. మరల ప్రయత్నించటం.

**5. ఆలస్యమ్:** బద్ధకించటం, స్థూల శరీరంవల్లగాని, మరే కారణంచేతగాని ఇది జరుగుతుంది. చిత్తంలో మాలిన్యాలు ఎక్కువగా ఉండటంవల్ల, తమోగుణం వల్ల ఇది కలుగుతుంది.

**6. అవిరతి:** ప్రాపంచిక సుఖాలపై అనురాగము (వైరాగ్యలేమి)

**7. భ్రాంతిదర్శనం:** లోకంలో కపట యోగులు అనేక తేలిక మార్గాలు, అనుభవాలను చెబుతూ ఉంటారు. పతంజలి అష్టాంగయోగం కన్న అదే మేలేమో! దగ్గర దారేమో అనిపించటం.

**8. అలబ్ధ భూమికత్వం:** చాలాకాలంగా ధ్యానసాధన చేస్తున్నా మధుమత్యాది నామములు గల చిత్త దశలను పొందలేకుండుట. ఏకాగ్ర చిత్తం రాకుండుట.

**9. అనవస్థితత్వం:** కొన్ని చిత్తభూములను పొందినను నిలుకడలేకపోవుట. విక్షిప్తం కలుగుచుండుట.

ఈ తొమ్మిదీ యోగవిఘ్నాలు. ఏకాగ్ర, నిరుద్ధ దశలకు అడ్డంకులు. వీటితోపాటు మరికొన్ని విఘ్నాలు కూడా ఉంటాయంటాడు పతంజలి మహర్షి

**దుఃఖదౌర్మనస్యాఙ్గమేజయత్వశ్వాసప్రశ్వాసా విక్షేపసహ
భువః॥**యోగ.ద.(1-31)

**1. త్రివిధ దుఃఖాలు:** ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక దుఃఖాలు.

**2. దౌర్మనస్యము:** కోరికలు నెరవేరనందున కలిగే మానసిక వికలత.

**3. అంగమేజయత్వం:** ఆసనము సిద్ధించక శరీరంలో కదలికలు.

4. **శ్వాస ప్రశ్వాసలు:** ఊపిరి పీల్చుట, వదులుటలో కలిగే ఇబ్బందులు, కదలికలు.

ఇవన్నీ పోవాలంటే - **తత్ప్రతిషేధార్థమేకతత్త్వాభ్యాసః** (యో.ద. 1-32)

ఏకేశ్వరుని ఉపాసించాలి. ఓంకారాన్ని స్మరిస్తూ నిరాకార సర్వ వ్యాపకుని ఉపాసించాలి. అనేక దేవీ దేవతల కల్పన చేయకూడదు.

పై ఋగ్వేద మంత్రం ఈ 9+5 = 14 విఘ్నాలు తొలగించి నన్ను నీ వైపు నడిపించుకోమని ప్రార్థించాలంటుంది.

**"యత్కించాహం త్వాయురిదం వదామి తత్ జుషస్వ"** అంటూ ఈశ్వర సమర్పితం కావాలి. దీనినే అనన్యభక్తి అంటారు. మనం సరిగా పరమేశ్వర ప్రణిధానం చెయ్యగలిగితే మన మనస్సు నిలిచి సానుకూలం అవుతుంది. క్రమంగా సమాధి స్థితి కలుగుతుంది. అప్పుడే మనకు దేవునిలోని దివ్య గుణాలు కొన్ని మనకు ప్రాప్తిస్తాయి. ఇదే విషయాన్ని ఈ మంత్రంలోని చివరి వాక్యం **"కృధి మా దేవవన్తమ్"** - "నన్ను దివ్యగుణయుక్తిని చెయ్యి" అని ప్రార్థించమంటున్నది. అస్తు-మనం అట్లే చేద్దాము.

## ఈశ్వరోపాసన రహస్యం

'ఉపాసన' అంటే సమీపంలో ఆసీనులు కావటమని సామాన్య అర్థం. కాని, పరమేశ్వరుని సమీపంలో కూర్చున్నప్పుడు మాత్రమే దానిని ఉపాసనగా గుర్తించాలని పెద్దలంటారు. అందుచే ఇచట ఉపాసన అంటే పరమేశ్వరోపాసనగా గుర్తించాలి. వైదిక ధర్మానికి చెందిన మనం పరమేశ్వరుడు సర్వవ్యాపకుడనే, నమ్ముతాం. నమ్మకమే కాదు యదార్థం కూడా. పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు కాకున్న సృష్టిలో నిరంతరం జరిగే క్రియలు-సూర్య చంద్ర నక్షత్ర గ్రహ గోళాదుల పరిభ్రమణం, అణువులలోని పరమాణువుల నియంత్రిత గతి, స్థావర జంగమ ప్రాణుల శరీర రచనా పాలనాది క్రియలు జరుగవు. ఎంత మహిమ ఉన్నా ఏకదేశవాసి ఈ విశాల విశ్వాన్ని, అందులోని అసంఖ్యాక ప్రాణులను సృజించగలడా? రక్షించగలడా? కనుక, పరమేశ్వరుని సర్వవ్యాపకునిగా గుర్తించినవారే నిజమైన ఆస్తికులు. అయితే, మరి సర్వవ్యాపకుని సమీపంలో కూర్చోవటమేమిటి?

లోకంలో దూరాలు రెండు రకాలుగా ఉంటాయి. 1) దేశదూరం, 2) కాలదూరం. ఈ రెండు దూరాలు పరమేశ్వరుడికి మనకు మధ్యలేవు. సర్వవ్యాపకుడు కనుక అతడు మన శరీరాలలోను, ఇంద్రియ మనోబుద్ధులలోను, చివరకు జీవాత్మలమైన మనలోను కూడా వ్యాపించి మన కత్యంత సమీపంగా ఉన్నాడు. కనుక జీవాత్మ పరమాత్మలకు మధ్య

దేశదూరం లేదు (స్థలం దూరం లేదు). అతడు సర్వకాలాలలోను భూత భవిష్యత్ వర్తమాన కాలాల యందంతటను మనతోనే ఉంటాడు కనుక అతనికీ మనకు మధ్య కాల దూరమూ లేదు. ఈ రెండు దూరాలే కాక అజ్ఞానమనే దూరం కూడా ఒకటుంటుందని విద్వాంసులంటారు. "ఉయ్యాలలో బిడ్డను పడుకోబెట్టి బిడ్డకోసం ఊరంతా వెతికిన తల్లి"వలె మనం అజ్ఞానంతో మనలో వ్యాపించియున్న పరమాత్మను మరచి దేవుడు ఎక్కడో ఉన్నాడని ఎక్కడెక్కడికో తీర్థయాత్రలు చేస్తూవుంటాము. దీనినే దేవునికి మనకు ఉన్నటువంటి అజ్ఞాన దూర మన్నారు విద్వాంసులు. ఈ అజ్ఞానాన్ని దూరం చేసుకుంటూ మనం ప్రతిదినం కొంతసేపు ఏకాంతంలో కూర్చుని మనలో అంతర్యామిగా వ్యాపించియున్న పరమాత్మను అనుభవం చేసుకోవటానికి ప్రయత్నం చెయ్యాలి. ఈ విధంగా ప్రయత్నం చెయ్యటాన్నే 'ఉపాసన' అంటారు.

నియమంగా మనం ఈ రకమైన ఉపాసనను అభ్యసిస్తే మనలోని అవిద్యాంధకారం తగ్గుతూ జ్ఞానజ్యోతి వికసిస్తుంది. అవిద్యాంధకారమంటే- జీవులమైన మనం మన స్వస్వరూపాన్ని (అసలు స్వరూపాన్ని) మరచి 'దేహమే నేను' అనే భ్రాంతిలో- భ్రమలో ఉండటం. దానితో అనిత్యమైన ఈ లోకంలోని ఆస్తిపాస్తులను, బంధుమిత్రాది సంబంధాలను, చివరకు మన శరీరాన్ని కూడా నిత్యమనే భ్రాంతిలోకి వెళ్ళిపోతాము. వాటికోసమే నిరంతరం శ్రమిస్తూ, పరితపిస్తూ ఉంటాము. అప్పుడప్పుడు అనిత్యమైన వీటి కోసం ధర్మపథాన్ని వదలి అధర్మాన్ని ఆచరించి పాపభాగులమౌతాము. కాలాంతరంలో అదే మన కష్టాలకు కారణమౌతుంది. ఇంతేగాక, నిరంతరం మల మూత్రాది మాలిన్యాలు తయారయ్యే మన శరీరాలు చాలా శుచిగా ఉన్నట్లు భ్రమిస్తాము. క్షణికంగా సుఖాన్ని కలిగించే ఈ ప్రాపంచిక సుఖాలనే నిత్యమైన సుఖాలుగా భావించి వాటి కొరకే జీవితమంతా శ్రమిస్తాము. ఆలోచనాపరులైన వివేకవంతులు-ఈ ప్రపంచంలో దొరికే సుఖాలన్నిటి వెనుక దుఃఖం దాగి ఉందంటారు. ఈ సుఖాల వెనుక రాగద్వేషాలు దాగి ఉంటాయి. అవి జీవుణ్ని మరింతగా అధర్మం వైపు తీసుకుపోతాయి. కనుక, ఈ అవిద్యాంధకారం పోగొట్టుకోవడానికి మనం నిత్యం ఉపాసన చెయ్యాలి. మనలో జ్ఞానం వర్ధిల్లచేసుకోవాలి. జ్ఞాన జ్యోతి వికాసానికి కేవలం వివేక వైరాగ్యాలు సరిపోవు అభ్యాసమనే ఉపాసన కూడా అవసరమంటాయి మన వేదశాస్త్రాలు.

ఉపాసనాభ్యాసం వల్ల మరొక గొప్ప ప్రయోజనమేమంటే- చిత్తం అంతర్ముఖమవుతుంది. ఏకాగ్రమవుతుంది. అభ్యాసం బలపడితే, క్రమంగా ఆత్మ పరమాత్మల సాక్షాత్కారమౌతుంది. అప్పుడు వర్ణనాతీతమైన గొప్ప ఆనందం కలుగుతుంది. ఆ ఆనందాన్ని చవిచూచిన ఒక ఋషి ఏమన్నాడంటే.

**"సమాధినిర్ధూతమలస్య చేతసో నివేశితస్యాత్మని యత్సుఖం భవేత్ ।**
**న శక్యతే వర్ణయితుం గిరా తదా స్వయం తదంతఃకరణేన గృహ్యతే"॥**

(మైత్రాయణ్యుపనిషత్తు. 4. 3. 9)

ఎవనికి సమాధియోగము వలన అవిద్యాది క్లేశాలు నష్టమౌతాయో, ఎవడు అంతర్ముఖుడై పరమాత్మయందు చిత్తాన్ని స్థిరపరుస్తాడో అతనికి కలిగే ఆ సుఖం మాటలతో వర్ణించనలవికానిది. ఎందుచేతనంటే ఆ ఆనందాన్ని జీవాత్మ తన అంతఃకరణంతో మాత్రమే తెలుసుకోగలుగుతుంది.

సమాధియోగం అంటే- పతంజలి మహర్షి సూచించిన అష్టాంగయోగ మార్గం. 'సమాధి' అనేది 8వ అంశం. ఈ అష్టాంగాలను ఎనిమిది మెట్లుగా భావించవచ్చు. 8వ మెట్టు పైకి రావడానికి ముందుగా ఏడు మెట్లు ఎక్కవలసి ఉంటుంది. అట్లే 'సమాధి స్థితిని పొందటానికి ముందటి 7 అంగాలను అభ్యసించక తప్పదు. ఉపాసనాభ్యాసం చేసేవారునూ ఈ ఏడు అంగాలను విధిగా అభ్యసించవలసి ఉంటుంది. లేకున్న ఉపాసనలో ఉన్నతి కలుగదు. ఆ ఏడు అంగాలు (మెట్లు) ఏమిటంటే యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ మరియు ధ్యానములు. వీటి సంక్షిప్త వివరణ మేమంటే-

పై పతంజలి మహర్షి సూచనల ననుసరిస్తూ ఉదయ సాయంకాలాలలో ఒక గంట సమయం ఉపాసనచేస్తే ఆత్మ అంతఃకరణాలు పవిత్రమౌతాయి. పరమేశ్వరుని, దివ్యగుణాలు మనలో ప్రవేశించి మనని దివ్య గుణయుక్తులను చేస్తాయి. మనను దేవతలుగా మహాత్ములుగా మార్చి చివరకు ముక్తిని కలిగిస్తాయి. ఉపాసనా సూత్రమంటే- మనం దేనిని ఉపాసిస్తామో వాటి గుణాలు మనలో ప్రవేశిస్తాయి. ఇది స్నేహ సూత్రం వంటిదే. మనం ఎటువంటి వారితో స్నేహం చేస్తే అటువంటి గుణాలు వచ్చినట్లే, దివ్యగుణయుక్తుడైన పరమేశ్వరుని ఉపాసిస్తే ఆ దివ్యగుణాలు మనలో ప్రవేశిస్తాయి. చలితో బాధపడే

వ్యక్తి అగ్నిని ఉపాసిస్తే ఆ దివ్యగుణాలు మనలో ప్రవేశిస్తాయి. చలితో బాధపడే వ్యక్తి అగ్నిని ఉపాసిస్తే వెచ్చదనం కలిగి చలిబాధ నివృత్తి చెందుతుంది. వేసవి తాపంతో బాధపడే వ్యక్తి చల్లటి నీటిని, చల్లని గాలిని సమీపించుట వలనల తాపబాధ నివృత్తి చెందుతుంది. అట్లే ప్రాపంచిక దుఃఖాలతో సతమతమయ్యే మనం దుఃఖరహితుడు, క్లేశరహితుడునైన పరమాత్మను ఉపాసిస్తే దుఃఖోపశమనం కలుగుతుంది.

ఉపాసన సగుణోపాసన, నిర్గుణోపాసన అని రెండు రకాలుగా ఉంటుంది. అంతర్యామియైన పరమేశ్వరుడు సర్వజ్ఞుడు, న్యాయకారి, దయాళుడు, ఆనందస్వరూపుడు అనుకుంటూ అంతర్ముఖులమై ఉపాసన చేస్తే దానిని సగుణోపాసన అంటారు. అతడు అజ్ఞానరహితుడు, క్లేశరహితుడు, స్థూల సూక్ష్మకారణ శరీర రహితుడు జన్మ జరా మృత్యురహితుడు అనుకుంటూ అంతర్ముఖులమై ఉపాసన చేస్తే దానిని నిర్గుణోపాసన అంటారు. ఈ రెండునూ ఒకే లక్ష్యాన్ని చేరుస్తాయి. ఆ లక్ష్యమేమంటే సమస్త దుఃఖాలనుండి నివృత్తి, పరమానంద ప్రాప్తి, దానినే ముక్తియని, నిఃశ్రేయసమని శాస్త్రాలు ఘోషిస్తాయి.

నేడు లోకంలో సాకారోపాసన పేరుతో రకరకాల దేవీదేవతల విగ్రహాలు నెలకొల్పి పూజలు వ్రతాలు తపాలు చేస్తున్నారు. ఇవన్నీ పూర్తిగా వేదవిరుద్ధం. పరమేశ్వరుడు విశ్వవ్యాపకమైన అత్యంత సూక్ష్మపదార్థం. దానికి మనం ఆకారాలు కల్పించలేము. ఇంతేగాక, విగ్రహాలు పృథివీతత్త్వంతో చేసిన జడపదార్థాలు, అంటే జ్ఞానం లేని పదార్థాలు. వాటిని ఉపాసిస్తే మనకు లభించేది జడత్వం మాత్రమే. మనం జ్ఞాన స్వరూపుడైన పరమేశ్వరుని ఉపాసించి మనలో జ్ఞానం పెంచుకోవాలే తప్ప దానికి విరుద్ధంగా ప్రవర్తించటం మంచిది కాదు. మన వేదాలు దర్శన ఉపనిషాదాదులు చూపిన మార్గంలో పయనించాలే కాని మధ్యకాలంలో వచ్చిన ఈ మూఢాచారాల వెనుక పోకూడదు. అస్తు.

# 9. పునర్జన్మలు సత్యమా?

నేడు జనసంఖ్యలో ఎక్కువ గల క్రైస్తవ, మహ్మదీయ మతాలు రెండూ పునర్జన్మలను అంగీకరించవు. ఈ మతాలలో దేవుడు జీవుణ్ణి క్రొత్తగా పుట్టిస్తాడనీ, శరీరం మరణించినా జీవుడు ఆ శవాన్ని అంటిపెట్టుకునే చిరకాలం ఉంటాడని చెబుతాయి. సృష్టి ముగింపుసమయంలో 4వ ఆకాశం నుండి యహెూవా దేవుడు, 7వ ఆకాశం నుండి అల్లాదేవుడు దిగి వస్తారట. వారితోపాటు ఏసు, మహ్మద్‌లు కూడా దిగి వస్తారట. అప్పుడు అప్పటివరకు ఖననం చేసిన సమాధులనుండి జీవాత్మలు బయటకు వస్తాయట. వారి పద్ధతిలో న్యాయనిర్ణయం చేసి కొందరిని స్వర్గానికి, కొందరిని నరకానికి పంపుతారట. వారు శాశ్వతంగా అక్కడనే ఉండిపోతారంటాయి. వారి మత గ్రంథాలైన బైబిలు, ఖురాన్‌లు.

భారతదేశంలో పుట్టిన చార్వాక బౌద్ధ జైన మతాలు దేవుణ్ణి అంగీకరించకపోయినా జీవాత్మలు వాటి వాటి కర్మలననుసరించి వివిధ ప్రాణులుగా పుడతాయంటారు. మనం చేసే కర్మలు సూక్ష్మ శరీరంగా ఉన్న మనస్సులో సంస్కారాలను కలిగిస్తాయనీ ఆ సంస్కారాలే (ఆ యా కోరికలే) మనకు జన్మలను కలిగిస్తున్నాయని వారి సిద్ధాంతం. మరెన్నో చిన్న చిన్న మతాలు ప్రపంచంలో ఉన్నాయి. అవి వారి బుద్ధికి అందినవిధంగా పునర్జన్మల గురించి చెబుతున్నాయి.

మన వేదధర్మంలోనూ ఆదికాలంనుండి పునర్జన్మలను గురించిన ఈ జిజ్ఞాస ఉన్నట్టు కనబడుతుంది. బ్రాహ్మణ, ఆరణ్యక దర్శన ఉపనిషదాదులన్నింటిలోను ఈ జిజ్ఞాసకు సమాధానా లున్నాయి. ఈ జిజ్ఞాసనుండి పుట్టినదే కఠోపనిషత్తు. అందు నచికేత బ్రహ్మచారి యమాచార్యుల వారిని ఈవిధంగా అడిగారు.

**శ్లో॥ యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే**
**అస్తీ త్యేకే నాయమస్తీతి చైకే,**
**ఏత ద్విద్యా మనుశిష్ట స్త్వయాఽహం**
**వరాణా మేషవరస్తృతీయః ॥** -కఠోపనిషత్తు (1-20)

తా॥ మానవుడు మరణించిన తదుపరి అతని ఆత్మ ఉంటుందని కొందరు, ఉండదని కొందరు అంటున్నారు. ఇందులో ఏది సత్యం? ఉ ంటుందా? ఉండదా? ఈ విషయాన్నే నేను మీనుండి తెలుసుకోగోరుచున్నాను. ఇది మీరిచ్చిన 3వ వరంగా అడుగుతున్నాను అంటే- దానికి యమాచార్యులవారు -

శ్లో॥ దేవై రత్రాపి విచికిత్సితం పురా
న హి సువిజ్ఞేయ మణురేషధర్మః,
అన్యం వరం నచికేతో వృణీష్వ
మా మోపరోత్సీ రితి మా సృజైనమ్ ॥ -కఠోపనిషత్తు (1-21)

తా॥ ప్రాచీనకాలం నుండి ఈ విషయంలో విద్వాంసులలోనూ కొన్ని సందేహాలున్నాయి. నాయనా! ఈ విషయం చాలా సూక్ష్మమైనది. సులభంగా అర్థమయ్యేదికాదు. దీని బదులు మరొక విషయం ఏదైనా అడుగు. లేదా ధన కనక వస్తు వాహనాది ఐశ్వర్యాలనెన్నింటినైనా కోరుకో. నీ కోరికలనన్నింటిని పూర్తి చేస్తానంటూ తప్పించుకోవడానికి ప్రయత్నిస్తాడు. కానీ నచికేతుడు వదిలిపెట్టలేదు. ఇది అంత విలువైన విశిష్టమైన విషయమైతే ఆ విషయమే నాకు కావాలి. మరేదీ వద్దు అంటూ భీష్మించుకొని కూర్చుంటాడు. నీ కీ విషయం బాగా తెలుసు. నాకు నీవంటి గురువు లభిస్తే నేనెందుకు వదిలిపెడతాను? అది ఎంత సూక్ష్మ విషయమైనా మనన చింతనలు చేసి అర్థం చేసుకుంటానంటాడు. అప్పుడు యమాచార్యులవారే.

"నాయనా! నచికేతా! నీ జిజ్ఞాస యొక్క తీవ్రతను గుర్తించాను. ప్రాపంచిక విషయాలపై వైరాగ్యం కలవానికే ఇట్టి సూక్ష్మ విషయాలు అర్థమౌతాయి. అట్టి వైరాగ్యం కూడా నీకు కలిగింది. కనుక నీవు యోగ్యుడవే అంటూ ఆత్మ పరమాత్మల విషయం విశదంగా ఉపదేశిస్తాడు. ఆ విషయాలన్నీ కఠోపనిషత్తులో చదువుకోండి. ఇక్కడ వాటి సారాంశం సంక్షిప్తంగా తెలుపుచున్నాము.

ఈ శరీరంలో జీవాత్మ పరమాత్మలు రెండూ ఉంటాయి. పరమాత్మ సర్వ వ్యాపకము కనుక అది జీవిత శరీరంలోనూ ఉంటుంది, మృత శరీరంలోనూ ఉంటుంది. జీవాత్మయే జీర్ణమైన శరీరాన్ని వదిలి క్రొత్త శరీరంలో ప్రవేశిస్తూ

ఉంటుంది. జీవాత్మ శరీరరథంలో ఆసీనుడైన మహారాజువలె ఉంటుంది. మానవ శరీరాన్ని రథంతో పోలిస్తే ఇంద్రియాలు గుఱ్ఱాలవలె ఉంటాయి. మనస్సు కళ్ళెంగాను, బుద్ధి సారథిగాను ఉంటాయి. వీటన్నింటికన్నను శ్రేష్ఠంగా జీవాత్మ రథంలో కూర్చున్న రాజుగా ఉంటుంది.

ఈ విషయాలనన్నింటిని చక్కగా అర్థం చేసుకున్న జీవాత్మ యమ నియమాది అష్టాంగయోగ సాధనలు చేస్తూ ఇంద్రియ మనోబుద్ధులను తన వశంలో పెట్టుకోగలుగుతాడు. వాటిని సత్కర్మలయందు ప్రవేశపెడుతూ పుణ్యాత్ముడవుతాడు. తాను చేసిన ఆ సత్కర్మల ఫలాలను కూడా పరమేశ్వరుని కర్పిస్తూ దేవయాన మార్గాన పయనిస్తాడు. అంతర్ముఖుడై ఆత్మ పరమాత్మల సాక్షాత్కారాన్ని పొంది కృతకృత్యుడౌతాడు. జనన మరణరూప సంసార చక్రబంధనాన్నుండి విడివడి, సర్వదుఃఖ నివృత్తిరూప పరమానందాన్ని పొందుతా దని బోధిస్తాడు. ముక్తిని పొందటానికి ఇంతకన్న వేరొక మార్గం లేనేలేదని కూడా ఉపదేశిస్తాడు. ఇక మనం పునర్జన్మలను గురించి ఆలోచిద్దాము.

మనం మానవ సమాజాన్ని పరిశీలించి చూస్తే కొందరు భాగ్యవంతుల యింట పుట్టి సుఖ సంతోషాలతో విందులతో వినోదాలతో ఆనందంగా గడిపేవారు కొందరుంటారు. కొందరు పేదవారి యింట పుట్టి చిన్ననాటినుండి రెక్కాడితేగాని డొక్కాడని విధంగా జీవిస్తూ ఉంటారు. మరికొందరు మధ్యరకంగా కొన్ని సుఖాలను, కొన్ని కష్టాలను అనుభవిస్తూ ఉంటారు. కొందరు ఆరోగ్యంగానూ, కొందరు రోగాలతోనూ సతమతమవుతూ కనబడతారు. లోకంలోని ఈ సుఖదుఃఖాల వ్యత్యాసానికి కారణమేమిటి? జీవుణ్ణి దేవుడు క్రొత్తగా పుట్టిస్తే కొందరిని పేదలుగా, రోగులుగా ఎందుకు చేశాడు? క్రైస్తవ మహ్మదీయులు దీనికి ఏమి సమాధానము చెబుతారు? "అది దేవుని యిష్టం (అల్లా కే మర్జీ)" అంటే దేవుడు అన్యాయకారి అవుతాడు కదా! ఆలోచించండి.

మన వైదిక ధర్మమే ఇటువంటి ప్రశ్నలకు హేతుబద్ధమైన చక్కని సమాధానాలు చెబుతుంది. ఈ వ్యత్యాసాలకు కారణం పూర్వజన్మలు. పూర్వజన్మలలో చేసిన పాప పుణ్యకర్మలే ఈ జన్మలో కష్టసుఖాలను కలిగిస్తున్నాయి. కొందరు కొద్ది ప్రయత్నంతోనే విద్యావంతులుగా, కళాకారులుగా, విశేష ప్రతిభావంతులుగా, నాయకులుగా, అధికారులుగా

తయారౌతున్నారు. వీటికి వీరు పూర్వ జన్మలలో చేసిన సాధన, పరిశ్రమలే కారణం. అట్లే, ఈ సృష్టిలో అనేకానేక ప్రాణిజాతులు కనబడుతున్నాయి. దీనికి మానవులు చేసే చిత్ర విచిత్ర కర్మలే కారణం (కర్మ వైచిత్యాత్ సృష్టి వైచిత్యమ్) అంటారు మహర్షి కపిలుడు. తమ సాంఖ్యదర్శనం (6-41) లో కారణం లేకుండా కార్యం కాదనేది సృష్టిలో నెలకొన్న శాశ్వత సత్యం. అట్లే, "నాసతో విద్యతే భావో నా భావో విద్యతే సతః" అంటుంది. (భగవద్గీత 2-16)

1. అభావం నుండి భావ పదార్థం పుట్టదు. (ఉనికి లేని దానినుండి ఉనికి గల పదార్థాలు పుట్టవు. అంటే శూన్యం నుండి ఏవీ పుట్టవు- అని అర్థం.

2. భావ పదార్థం లేకుండా పోదు - శూన్యం కాదు అనేది కూడా శాశ్వత సత్యం. ఇట్టి సిద్ధాంతాలనే వేదం 'ఋతము' లంటుంది.

ప్రాచీన కాలంలో మన ఋషులు, ఆచార్యులు ఉపదేశాలు చేసేముందు **"ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి, తన్మా మహతు, తద్వక్తారమవతు। అవతు మామ్ అవతు వక్తారమ్ । ఓం శాంతిః శాంతిః శాంతిః"**

ఋతములనే- ప్రకృతి నియమాలకు, తర్కమునకు, విజ్ఞానమునకు నిలబడువానినే నేను ఉపదేశింతునుగాక! మనోవాక్కాయాలతో సత్యమునే ఉపదేశింతునుగాక, ఆచరింతునుగాక, నమ్మెదునుగాక ! ముఖ్యంగా ఆ సత్యకథనములే నన్ను రక్షించునుగాక! నన్నేగాక సత్యోపదేశకులనందరిని రక్షించునుగాక!" అంటూ ప్రతిజ్ఞ చేసి ఉపదేశించేవారు.

కనుక ఏ మతంవారైనా, ఏ సంప్రదాయానికి చెందినవారైనా తాము ఉపదేశించే విషయాలు ఋతములా? (విజ్ఞాన సమ్మతములా)? కావా? అని పరీక్ష చేసుకొని ఉపదేశించండి. సృష్టికర్తయైన దేవుడు కూడా సృష్టిలో తాను ఏర్పరచిన నియమాలు తప్పడు. 'కున్' అన్నంత మాత్రానగాని, 'అగుగాక' అన్నంత మాత్రానగాని శూన్యంనుండి ఏదీ అప్పటికప్పుడు పుట్టదు. పూర్వజన్మలు లేకుంటే జీవులందరికి సుఖదుఃఖాలు, ప్రావీణ్యతలు సమానంగా ఉండాలి. అలా లేవు కదా! కనుక పూర్వపర జన్మలు సత్యములే.

ఈ విషయంలో ఈశ్వరీయ జ్ఞానమైన వేదం ఏమి చెబుతున్నదో తదుపరి వ్యాసంలో తెలుసుకొందాము.

# 10. వేదాలలో పునర్జన్మ

సృష్టి స్థితి లయకర్తయైన ఏకేశ్వరుడు (ఏకైక దేవుడు) సృష్ట్యాదిలోనే బుద్ధిజీవులైన మానవులకు సృష్టి రహస్యాలను, సృష్టిలోని ఆ యా పదార్థాల జ్ఞానాన్ని వేదం ద్వారా ఉపదేశించాడు. ఆదిమానవ సృష్టిలోని యోగ్యులైన నలుగురు ఋషులు వాటిని అందుకొని తోటి మానవులకు అర్థసహితంగా వాటిని వివరించి చెప్పారు. అవి సృష్టికర్త వాక్యాలే కాని ఋషుల వాక్యాలు కావు. అందుచేతనే వాటిని అపౌరుషేయాలన్నారు. తరతరాలుగా వాటిని వింటూ నేర్చుకుంటున్నారు గనుక శృతులన్నారు. అవే భారతీయుల అసలైన ధర్మగ్రంథాలు. **ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమం శృతిః** (మను. 2-13) - ఒకే విషయంపై రెండు మూడు అభిప్రాయాలేర్పడితే శృతినే - వేదాన్నే పరమప్రమాణంగా తీసుకోవాలంటారు ఋషులు. కనుక పునర్జన్మ విషయంలో వేదమేమంటుందో తెలుసుకుందాము.

**అసునీతే పునరస్మాసు చక్షుః, పునః ప్రాణమ్ + ఇహ నో ధేహి భోగమ్**
**జ్యోక్ పశ్యేమ సూర్యమ్ + ఉచ్చరన్తమ్ + అనుమతే మృళయా నః స్వస్తి ॥**

(ఋగ్వేదం 10-59-6)

ఓ అసునీతే - ప్రాణాలను నియమించి నడుపు ఓ సృష్టికర్తా! ఈ జన్మలో కన్నులను ఇచ్చినట్లే రాబోవు జన్మలోను మాకు నేత్రాలను ప్రసాదించు. మరల మాకు ప్రాణాలను, అందుకు తగిన భోగాలను ప్రసాదించు. వాటితో మేము చిరకాలం ఉదయించుచున్న సూర్యుని దర్శిస్తూ ఉన్నతమైన ప్రేరణలను (ఆలోచనలను) పొందుదుముగాక! ఓ అనుమతే (కర్మ ఫలాలను సరిగా తూచి యిచ్చు సర్వాంతర్యామీ)! కరుణించి మమ్ము స్వస్తి మార్గాన నడిపి మాకు శుభములను కలిగించుచు కాపాడుము.

పై మంత్రంలోని "అసునీతుడు, అనుమతుడు" అనే రెండు పదములు ఏకేశ్వరునకే వర్తిస్తాయి. అవి రెండూ సృష్టికర్తలోని రెండు విశేష గుణాలను తెలుపుతున్నాయి. అసువులు అంటే ప్రాణాలు. వాటిని నియమించి నడుపుతూ ఎవరికెంత ఆయువునివ్వాలో అంత యిస్తున్నాడు కనుక దేవునికి 'అసునీతు'డని

మరియొక పేరు. పూర్వజన్మలోను, ఈ జన్మలోను మనం చేసిన కర్మలనుబట్టి మన ఆయువు నిర్ణయింపబడుతుంది. భోగములు కూడా అంతే. "జాత్యాయుర్భోగాః" అంటారు ఋషులు. అంతేకాని, అన్నీ దేవుని ఇష్టాయిష్టాలపైననే - దయాదాక్షిణ్యాలపైననే కలగటంలేదు. సామాన్యంగా గాలి తిర్యక్ గమనం గలది - అడ్డంగా ప్రవహించే (వీచే) గుణం కలది. కానీ, అది మన శరీరంలోకి పైకి క్రిందికి ప్రవహిస్తున్నది. ముక్కు చివర నుండి రెండంగుళాలు పైకి ప్రవహించి సుమారు ఒక అడుగు క్రిందికి ఊపిరితిత్తులలోనికి ప్రవహిస్తున్నది. మరి, ఈ పని చేస్తున్నది ఎవరు? ప్రాణాయామం చేసేటప్పుడు మన ప్రయత్నం (జీవుని ప్రయత్నం) ఉంటుంది. కానీ, సామాన్య స్థితిలోను, సుషుప్తిలోను (గాఢనిద్రలోను) ప్రాణాలను నడిపిస్తున్నది పరమేశ్వరుడే. కనుక అతడు అసునీతుడు - ప్రాణ ప్రదాత అని మరువకూడదు. అట్టి దేవదేవుని ప్రార్థన ఈ మంత్రంలో ఉంది. మనం దేవుని ఏమని ప్రార్థించాలంటే -

**పునః + అస్మాసు చక్షుః** = ఇప్పటివలెనే మరుజన్మలోనూ మాకు నేత్రములను ప్రసాదించు. వాటితో మేము నీ అద్భుతాద్భుత సృష్టిని దర్శిస్తూ ఆనందించునట్లనుగ్రహించు.

**పునః ప్రాణమ్** = ఈ జన్మలో వలెనే వచ్చే జన్మలోనూ మా ప్రాణాలను నడిపించి దీర్ఘాయుష్షు నిమ్ము.

**ఇహనో ధేహి భోగమ్** = భోగాలను ఇంద్రియ పటుత్వాన్ని, సిరిసంపదలను, ఆదర సత్కారాలను, యోగ సాధనాలను వచ్చే జన్మలో కూడా ప్రసాదించు.

**జోక్ పశ్యేమ సూర్యమ్ ఉచ్చరన్తమ్** = చిరకాలం ఉదయించుచున్న సూర్యుని దర్శిస్తూ ఉన్నతమైన ప్రేరణలను పొందునట్లనుగ్రహింపుము. మరొకచోట వేదం ఏమంటుందంటే - **"విశ్వదానీం సుమనసః స్యామ, పశ్యేమ ను** సూర్యముచ్చరన్తమ్ (ఋ. 6-52-5) ఓ సర్వ సంరక్షక! మేము సర్వకాలాలలోను ప్రసన్నంగానే ఉందుముగాక! ఉదయించుచున్న సూర్యుని చూస్తూ మేము కూడా సర్వవిధాల ఉన్నతిని పొందుదుముగాక!" అని

సంకల్పించమంటుంది. ఈవిధంగా వేదాలలో ప్రాతః ఉషస్సులను, సూర్యోదయాన్ని ఉపమానంగా చూపిస్తూ శాంతిని ఉన్నతిని పొందమంటుంది. అసలు పరమేశ్వరుడు మనకు ఈ మానవజన్మనిచ్చింది మరింత ఉన్నతిని సాధించటానికేగాని అవనతిని - దిగజారిపోవటానికి కాదు. మరొకచోట వేదం

**"ఉద్యానం తే పురుష న + అవయానం, జీవాతుం తే దక్షతాతిం కృణోమి।**
**ఆ హి రోహేమ మమృతం సుఖం రథమ్, అథ జిర్వి ర్విదథమా వదాసి॥**

- అథర్వవేదం (8-1-6)

ఓ మానవా! ఉత్తమ కర్మలు చేస్తూ ఉన్నతిని సాధించు. నీచకర్మలు చేస్తూ అవనతిని - క్రిమి కీటకాది జన్మలను పొందవద్దు. నేను నీకు మానవజన్మను, జీవితాన్ని, దక్షతను ఇచ్చాను. ఈ ఉత్తమ సుఖకారక మానవ శరీరరూప రథాన్ని అధిరోహించి దీనితో నీవు ఉన్నతిని, అమరత్వాన్ని పొంద యత్నించు. యజ్ఞమయ జీవితాన్ని గడుపుతూ వృద్ధుడవై నీ అనుభవాలను తోటి మానవుల కుపదేశిస్తూ ఆదర్శ పురుషుడవు కమ్ము" అంటుంది.

కనుక మనం సదా సత్కర్మలు ఆచరిస్తూనే ఉన్నతివైపు పయనించాలి. ఆ సత్కర్మల ఫలం ఈ జన్మలోనే కొంత కనబడుతుంది. ఏ కారణం చేతనైనా ముందుగా మరణిస్తే వాటిఫలం వచ్చే జన్మలో తప్పక వస్తుంది. అట్లే మనం చేసే సాధన కూడా కాలాంతరంలో ఫలితాన్నిస్తుంది. ఉదా: ఒక వ్యక్తి గొప్ప గాయకుణ్ణి కావాలని చాలా ప్రయత్నిస్తే అది ఈ జన్మలో సాధ్యం కాకపోయినా వచ్చే జన్మలో సాధిస్తాడు. నేటి ప్రసిద్ధ గాయకులు గత జన్మలలో ఎంతెంతో సాధన చేసి ఉంటారు. **"సాధనమున పనులు సమకూరు ధరలోన"** అంటారు నీతికోవిదులు. అందుచేతనే **"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః"** (యజు. 40.2) సత్కర్మలు, సాధనలు చేస్తూనే నూరేండ్లు జీవించమంటుంది వేదం.

**అనుమతే మృళయా నః స్వస్తి ॥**

మంత్రంలోని చివరి వాక్యం ఏమంటున్నదంటే - ఓ అనుమతీ! సున్నితపు త్రాసుతో తూచి తూచి యిచ్చునట్లు మా సుకృత దుష్కృత కర్మలకు

కొన్నింటిని తమ "ఋగ్వేదాది భాష్య భూమిక" అనే గ్రంథంలో వ్రాశారు. వివరంగా తెలుసుకోగోరువారు ఆ గ్రంథాన్ని చదువగోరుచున్నాము.

పునర్జన్మలున్నాయని నిరూపించటానికి కొన్ని ప్రత్యక్ష ప్రమాణాలు కూడా ఉన్నాయి. అప్పుడప్పుడు అక్కడక్కడ కొంతమంది చిన్నపిల్లలకు పూర్వజన్మ విషయాలు కొన్ని జ్ఞాపకం వచ్చి ప్రజలను ఆశ్చర్యపరచే విషయాలు చెబుతూ వుంటారు. వీటిపై వందలకొలది సంవత్సరాలుగా పరిశోధనలు జరుగుతున్నాయి. గ్రంథాలు వెలువడుతున్నాయి. వాటిలో మహాత్మాగాంధీగారు జీవించిన కాలంలో ఒక పాప శాంతాదేవి కథపై ఆనాటి వైజ్ఞానిక బృందం చేసిన పరిశోధనాఫలాలు నేటికిని భద్రపరచబడి ఉన్నాయి. నమ్మకం కలగకపోతే ఒకసారి మీ స్మార్ట్‌ఫోన్‌లో యూట్యూబ్‌లోనికి వెళ్ళి 'Punarjanma' అని సూచించండి. వెంటనే కొన్ని వీడియోలు వస్తాయి. వాటిలో గాంధీగారి పరిశోధన వీడియో తప్పక చూడండి.

కనుక పునర్జన్మల సిద్ధాంతం అక్షర సత్యం.

## 11. అడుగో! దేవుడు నీటిలో కనబడుతున్నాడు

'అడుగో! దేవుడు నీటిలో కనబడుతున్నాడు'. అంటే ఇదేదో పౌరాణిక భావన అనుకుంటున్నారా? కాదు! కాదు!! నిజంగానే పరిశీలనా దృష్టితో చూస్తే దేవుడు నీటిలో కనబడుతాడు. అయితే, వైజ్ఞానిక దృష్టితో చూస్తేనే అతడు కనబడుతాడు. భౌతిక నేత్రానికి కాదు. సామాన్య కంటితో చూస్తే వట్టి నీళ్ళే కదా! దేవుడేడి? అంటారు.

చాలా సంవత్సరాల క్రిందటి మాట - దేవుణ్ణి గురించి ఆధునిక వైజ్ఞానికులేమంటారో తెలుసుకోవాలని ఒక రచయితకు జిజ్ఞాస కలిగింది. ఆయన కొందరు వైజ్ఞానికులను దేవున్ని గురించి మీ అభిప్రాయాలను తెలుపండని కోరాడు. కొందరు దేవుడున్నాడనీ, కొందరు లేడని చెప్పారు. అందులో దేవున్ని అంగీకరించేవారి అభిప్రాయాలను ఒకచోట చేర్చి ఒక పుస్తకంగా ముద్రించాడు. అందులో ప్రఖ్యాత రసాయన శాస్త్రవేత్త డా॥ థామస్ డేవిడ్ పార్క్స్ గారి అభిప్రాయం చాలా ఆకర్షణీయంగానూ ఆలోచింపజేసేదిగానూ ఉంది. ఆయన ఇవినోయ విశ్వవిద్యాలయం నుండి పిహెచ్.డి పొందిన వ్యక్తి. స్టేన్‌ఫోర్డు పరిశోధనా సంస్థలో రసాయన విభాగాధ్యక్షునిగా పనిచేసినవాడు. క్లోరోక్స్ కెమికల్ కంపెనీలో పరిశోధకునిగా పనిచేస్తున్నాడు. మైక్రో కెమిస్ట్రీ, ఎలక్ట్రోలైటిక్ ఫినోమినా, ఎక్స్‌రే డిఫ్రెక్షన్ మొదలైన విషయాలలో కూడా అనుభవమున్న గొప్ప ఆధునిక విజ్ఞానవేత్త. ఆయన ఏమన్నారంటే-

మనం మన చుట్టూ ఉండే ఈ జగత్తును నలువైపులా పరికించి చూచినట్లయితే సృష్టిలో అంతటా ఒక నియమబద్ధత, ప్రయోజనం కనబడతాయి. ఇవన్నీ ఈవిధంగా వాటంతట అవే ఏర్పడ్డాయంటే నేను నమ్మలేకపోతున్నాను. వీటన్నిటివెనుక నాకు అనంత శక్తి సామర్థ్యాలు గల బుద్ధితత్వం (జ్ఞానతత్వం) కనబడుతున్నది. ఆ బుద్ధితత్వాన్నే నేను పరమాత్మ అంటున్నాను అన్నారు.

ఈ విషయం వివరించమని కోరగా ఆయన ప్రతీ రసాయన తత్వవేత్త తత్వాల కలయిక వెనుక నియతకాలిక వ్యవస్థ ఉంటుందని నమ్ముతాడు.

మనం మనచుట్టూ విస్తరించియున్న ప్రకృతిని పరిశీలించి చూస్తే ప్రతీ పదార్థంలోనూ క్రమబద్ధత, నియమబద్ధతతోబాటు ఒక ప్రయోజనం కొరకు అది నిర్మించబడినట్లు కనబడుతుంది. ఇదంతా అకస్మాత్తుగా ఏర్పడింది కాదు. అనంత జ్ఞానం గల ఒక అదృశ్యతత్వం దీనిని నిర్మిస్తున్నది. ఆ తత్వంలో సర్వప్రాణిహితము, కల్యాణము సమావిష్టమైనట్లు కనబడుతున్నది. ఈ సృష్టిలో పొరపాటుకాని, న్యూనత కాని కనబడదు. అట్టి సర్వవ్యాపక జ్ఞానతత్వాన్నే నేను దేవుడు అంటున్నానన్నారు. తన ఈ ప్రతిపాదనను నిరూపించటానికి ఒక చక్కటి ఉపమానాన్ని సైతం వారు చూపించారు. ఆయన ఈవిధంగా అన్నారు.

ఉదాహరణకు- అందరకు అందుబాటులో ఉండే సర్వ సౌలభ్యమైన నీటినే తీసుకోండి. దాని నిర్మాణ ఫార్ములా ప్రకారం దాని అణుభారం - $18^0$ (మైనస్ $18^0$). ఇంత తక్కువ అణుభారం కలిగిన మరే మూలకమూ (ఎలిమెంట్) సామాన్య తాపమానంలో ద్రవరూపంలో ఉండలేదు. వాయురూపం చెందిపోతుంది. కానీ, **నీరు సామాన్య తాపమానంలో** ద్రవంగా ఉండటం మనం చూస్తున్నాం. మరొక ఉదాహరణ ఫార్ములా ప్రకారం అమ్మోనియా మూలక అణుభారం $17^0$ అది - $33^0$ (మైనస్ ముప్పైమూడు) డిగ్రీల సెంటీగ్రేడులోనే వాయురూపంలోకి మారిపోతుంది.

రసాయనిక కాలక్రమపట్టిక ననుసరించి మరొక మూలక సమ్మేళనం హైడ్రోజన్ సల్ఫైడ్‌కు నీటికి దగ్గర సంబంధముంది. దాని ఫార్ములా భారం - $34^0$ అది - $59^0$ డిగ్రీల సెంటీగ్రేడ్ (మైనస్ $59^0$ డిగ్రీల సెంటీగ్రేడ్)లోనే వాయురూపం చెందుతుంది. కాని, నీరు సామాన్య తాపమానంలో కూడా ద్రవంగానే ఉండటం రసాయనశాస్త్ర విజ్ఞానం తెలిసినవారందరికి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఆలోచింపజేస్తుంది. నీటిని నిర్మించిన సృష్టికర్త అద్భుత మేధావి అనిపిస్తుంది.

ఇంతేకాదు, నీటిలో మరెన్నో విశిష్ట గుణాలున్నాయి. వాటన్నిటినీ ఒకచోట చేర్చి ఆలోచిస్తే చాలా మనోరంజకంగా ఉంటుంది. నాకయితే సృష్టికర్త అద్భుత మేధస్సు నా ముందు సాక్షాత్కరిస్తున్నది.

సామాన్య దృష్టితో చూస్తే మనం నివసించే ఈ పృథివి నాలుగింట మూడు భాగాలు నీటితో కప్పబడి ఉంది. అందుచే వాతావరణంపై ఋతుక్రమంపై నీటి ప్రభావం అత్యధికంగా ఉంటుంది. ఒకవేళ నీటిలో పై అద్భుత గుణాలు లేకుంటే తాపమానంలో ఎంతటి హెచ్చుతగ్గులు విపరీతాలు జరుగుతాయో ఊహించలేము. సామాన్యంగా నీరు మనకు మూడు రూపాలతో కనబడుతుంది. గడ్డకట్టి మంచు (ఐస్) రూపంలోను, ద్రవరూపంలోను, నీటియావిరి రూపంలోను ఈ భూమిపై ఉంది. మంచు గడ్డగానున్న నీరు కరగటానికి చాలా వేడి కావాలి. సామాన్య తాపమానంలో అది చిరకాలం ద్రవరూపంలో ఉంటుంది. ఆ ద్రవరూప నీరు గాలిగా నీటియావిరిగా మారి వాతావరణంలో కలియాలంటే మరెంతో వేడి కావలసి ఉంటుంది. తాపమానంలో కలిగే హెచ్చుతగ్గులను తట్టుకోగల శక్తి నీటి కున్నది. ఒకవేళ నీటిలో ఈ తాపమాన నిరోధకశక్తి లేకుంటే ఈ పృథివిపై జీవరాశి మనుగడ సాగించటం దుష్కరమే. మానవావసరాలు కూడా సులభంగా నెరవేరేవికావు.

నీటిలో మరికొన్ని అద్భుత విశేషతలున్నాయి. వాటిని చూచినపుడు నా మదిలో సృష్టికర్త గొప్ప దయామయుడనిపిస్తుంది. తాను సృజించిన ప్రాణుల రక్షణకొరకును తగిన వ్యవస్థ చేశాడనిపిస్తుంది. చిత్రవిచిత్రమైన ఈ సృష్టిలో మనకు తెలిసిన పదార్థాలలో గడ్డకట్టిన పదార్థాలు తేలిక కావటం అనే విశేషత ఒక్క నీటిలోనే కనబడుతుంది. ఈ కారణంతోనే నదులలోని సరస్సులలోని నీరు చలికి గడ్డకట్టి అవి మునిగిపోకుండా నీటిపై తేలియాడుతాయి. చలి ఎక్కువయ్యేకొలది అవి మరింత గట్టిపడతాయి. క్రమంగా ఆ నీటిపై గడ్డకట్టిన మంచుపొర ఏర్పడుతుంది. ఆ మంచు పొర క్రమంగా ఆ నీటికి రక్షణ కవచంగా ఏర్పడి లోపలనున్న నీటి ఉష్ణోగ్రతను రక్షిస్తుంది. క్రింది నీరు చలికి గడ్డకట్టకుండా చేస్తుంది. అందుచే ఆ పొర అడుగున ఉన్న నీరు ద్రవరూపంలోనే ఉంటుంది. తద్వారా ఆ నీటిని ఆశ్రయించుకున్న చేపలు మొదలైన జలచరాలు కాపాడబడతాయి. మరల వసంత ఋతువు వచ్చి పైన గడ్డకట్టిన నీరు కరిగేవరకు జలచరాలు ఆ పొరక్రింద సురక్షితంగా ఉంటాయి. అందుకనే నేను సృష్టికర్త దయామయుడంటున్నాను. అతడు ప్రాణులను సృజించటమేగాక వాటికి కావలసిన అవసరాలను, రక్షణను సమకూర్చాడు.

మరొక ఆశ్చర్యకరమైన విషయమేమంటే- ధృవప్రాంత సముద్రాలపై శీతకాలంలో మైళ్ళకొద్దీ తాయివంటి గట్టి మంచుపొర ఏర్పడుతుండట. ఆ పొరపై అక్కడక్కడ బండపై బోరింగులు వేసినట్లు రంధ్రాలు ఏర్పడతాయట. అందులో నుండి ఆక్సిజన్‌తో కూడిన గాలి లోపలి నీటికి అందుతుండట. దానితో లోపలి నీటిలో నివసిస్తున్న జలచరాలకు ఆక్సిజన్ కూడా అంది చక్కగా జీవిస్తాయట. ఈ రంధ్రాలు ఏ సృష్టినియమాలతో ఏర్పడతాయో తెలియదు. ఇట్టి ఏర్పాట్లను చూసి ఎంత దయామయుడో దేవుడు అని సంభ్రమాశ్చర్యాలు కలుగుతాయి. భగవంతునిపై మరింత భక్తి ఏర్పడుతుంది.

సర్వసౌలభ్యమైన నీటిలో ఇంకనూ మరెన్నో సుగుణాలున్నాయి. అది భూమిలోనికి యింకి నిలువ ఉంటుంది. మట్టిలోని రసాయనాలను తనలో కలుపుకొని వృక్షముల ద్వారా పీల్చబడినప్పుడు వాటికి నీటితోబాటు ఆహారాన్ని కూడా అందజేస్తుంది. మన శరీరంలోనూ ఇట్లే ఆహారసారం రక్తంలో ఉండే నీటి మాధ్యమంగానే ప్రతీ కణానికి చేరుకొంటుంది. నీటికి తనలో కరిగించుకునే గుణం మిగతా వాటికన్నా ఎక్కువగా ఉంటుంది. అందుచేతనే వస్త్రాలను, వస్తువులను తేలికగా శుభ్రం చేసుకోగలుగుచున్నాము. నీటియొక్క బాష్పీకరణ స్థానం $100^0$సి (100 డిగ్రీల సెంటీగ్రేడ్) కావటంవల్ల తాపమానం యొక్క విస్తృత శృంఖలములో యిది ద్రవంగానే ఉంటూ మానవ జీవనావసరాలకు ఎంతగానో ఉపకరిస్తున్నదన్నారు. డా॥ థామస్ డేవిడ్ గారు ఈ సందర్భంలో మరికొన్ని విషయాలు తెలిపారు. అనేకమంది వైజ్ఞానికులు నీటియొక్క ఆశ్చర్యజనక విశిష్ట లక్షణాలపై అధ్యయనం చేసి వారి వారి బుద్ధికి అందిన వ్యాఖ్యలు వారు చేశారు. మనం వాటినన్నిటిని ఒకచోట పెట్టి ఆలోచిస్తే నీరు ఎలా ఏర్పడింది? అనే ఆలోచనతోపాటు దానిని ఆవిధంగా చేసిందెవరు? ఎవరికొరకు చేశారు? అనే ఆలోచన చేయటం కూడా అవసరం. ఆవిధంగా ఆలోచించగలిగినవాడే మహోన్నత మానవాతీత బుద్ధిమతత్వాన్ని గుర్తించగలడు అన్నారు. "ఆశ్చర్యకర అద్భుత గుణాలు కేవలం నీటిలోనే కాదు. అట్టి మరెన్నో పదార్థాలు ఈ సృష్టిలో ఉన్నాయి. వాటిని అధ్యయనం చేస్తే మనకు సంభ్రమాశ్చర్యాలు కలుగుతాయి. ఈ చమత్కారాలను పర్యవేక్షించిన నేను ఒక నిర్ణయానికొచ్చాను. ఆ సంతోషజనక సమాధానపూర్వక

నిర్ణయమేమంటే - ప్రకృతిలోని పదార్థాలన్నీ సహజంగా వాటంతటయువిగా ఏర్పడినవి కావు. సృష్టిలోని క్రమబద్ధత, నియమబద్ధత సర్వోన్నత బుద్ధిమంతుని శాసనంవల్లనే కలిగినవి. వీటి రచనయును (నిర్మాణమును) సర్వోచ్ఛకుశల రచయితచేతనే చేయబడింది. ఆ బుద్ధిమతత్త్వాన్నే నేను దేవుడు అంటున్నాను. ప్రాణుల హితము కొరకే అతడు యింతటి చమత్కారపూర్వక సృష్టిని చేశాడు. అతడు మహా మేధావి 'మహత్తర శక్తిసంపన్నుడేకాక మహా దయానిధి. అట్టి దివ్యగుణయుక్త దేవుడు నాకు వేరే పదార్థాలలో కన్న నీటిలోనే స్పష్టంగా కనబడుతున్నా'డన్నారు.

ప్రియ పాఠకులారా! డా॥ థామస్ డేవిడ్ గారి అభిప్రాయాలు చదివారు కదా! అంతటి ఆధునిక విజ్ఞానవేత్తకే నీటిలో దేవుడు కనబడుతూవుంటే - ఈశ్వరీయమైన వేదజ్ఞానాన్ని, ఋషుల జ్ఞానాన్ని అధ్యయనం చేసిన మనకెందుకు కనబడదు? పరిశీలనా దృష్టితో చూడండి తప్పక కనబడుతాడు. జల వైశిష్ట్యాన్ని తెలిపే మంత్రాలు వేదాలలో వందల కొలది ఉన్నాయి. నీరు కేవలం జీవనావసరాలకే కాక ఔషధంగా కూడా ఉపయోగపడుతుంది. నా రచన **'వేదాలలో జల చికిత్సా విజ్ఞానం'** (Hydrotherapy in Vedas) చదవండి. మరెన్నో పనికొచ్చే విషయాలు మీకు తెలుస్తాయి. అందుకనే ప్రకృతి చికిత్స వైద్యులు **'ఆపో వై భేషజం'**- నిశ్చయంగా నీరే గొప్ప ఔషధం అంటారు.

# 12. 'స్వస్తి పంథా మనుచరేమ'

## మేము సదా స్వస్తి పథాన్ని అనుసరింతుముగాక !

లోకాన్ని పరిశీలించి చూస్తే - ప్రతీ వ్యక్తి ఏవో కొన్ని ఆశలను ఆశయాలను కలిగి ఉంటాడు. వాటిని పొందటానికి తన బుద్ధికి అందిన మార్గాన్ని అనుసరిస్తాడు. సామాన్యంగా ఏ వ్యక్తీ కష్టమైన యిబ్బందులతో కూడిన మార్గాన్ని అనుసరించ యత్నించడు. ఏ మార్గంలో పయనిస్తే తన ఆశ నెరవేరుతుందో, ఇబ్బందులు లేని సరళ మార్గమనీ తన బుద్ధి అంగీకరించినప్పుడే ఆ మార్గాన్ని అనుసరిస్తాడు. అయితే, ఆ మార్గం స్వస్థి పథమా? కాదా? అనేది ఆలోచించవలసిన విషయం. బుద్ధిమంతులే ఆ విషయం చక్కగా ఆలోచించగలరు. చక్కటి మార్గాన్ని తెలుసుకొని అనుసరించి ఉన్నతిని పొందగలరు.

బుద్ధి పరమేశ్వరుడు మానవులకిచ్చిన గొప్ప వరం. మరి, అది అందరిలోనూ సమానంగా ఉండదు. దానికి పూర్వజన్మ సంస్కారాలు, ఈ జన్మలోని అనుభవాలు, ప్రయత్నాలు కారణంగా ఉంటాయి. అందుచే వారనుసరించే మార్గాలు భిన్న భిన్నంగా ఉంటాయి. దైవాన్ని, పూర్వ జన్మలను అంగీకరించని నాస్తికులు కేవలం ఈ జన్మలోని పూర్వపు అనుభవాల సమాహారమే బుద్ధి అంటారు. మరి, అది అందరిలోనూ సమానంగా వికసించలేదేమంటే - సమాధానం చెప్పలేరు. ఏవేవో హార్మోనుల ప్రభావమనీ, జీన్సులో లోపమనీ దాటవేయటానికి యత్నిస్తారేకానీ సూటిగా సమాధానం చెప్పలేరు. చెప్పినా అది హేతుబద్ధంగా ఉండదు.

ఆస్తికులలోనూ భిన్న భిన్న అభిప్రాయాలున్నాయి. క్రైస్తవ మహ్మదీయులు దేవున్ని అంగీకరిస్తారు. కాని జీవులకు పూర్వజన్మలను, పునర్జన్మలను అంగీకరించరు. అంతా పరమేశ్వరేచ్ఛ అంటారు. మన రంగు, రూపు, ఆరోగ్యం, ఐశ్వర్యం, భోగభాగ్యాలు, కళాకౌశలాలు, తెలివితేటలు, బౌద్ధికశక్తులు అన్నీ పరమేశ్వరుని వరప్రసాదాలేనంటారు. అంతా దేవుని యిష్టం దేవుడు కొందరిని భాగ్యవంతులుగా; కొందరిని బికారులుగ, కొందరిని ఆరోగ్యవంతులుగ, కొందరిని అనారోగ్యవంతులుగ; కొందరిని

తెలివైనవారుగ, కొందరిని మందబుద్ధులుగ పుట్టిస్తాడు. అది ఆయన అభీష్టం. ఈ విషయంలో ప్రశ్నించటంగాని, ఆలోచించటం గాని కూడదంటారు.

వేదధర్మాన్ననుసరించే భారతీయులు మాత్రమే జీవులకు పూర్వజన్మలు, పరజన్మలు ఉంటాయంటారు. జీవులకు దేవునికివలె ఎప్పటికిని ఉత్పత్తి వినాశములు లేవంటారు. అయితే ఈ యిద్దరిలో దేవుడు సర్వ వ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, నిత్యతృప్తుడు, నిరంజనుడు, అనంత పరిమాణము కలవాడు కాగా, జీవుడు ఏకదేశీయుడు, అల్పజ్ఞుడు, అల్పశక్తిమంతుడు మరియు అల్ప పరిమాణం గలవాడు. సామాన్య నేత్రదృష్టితోను, సూక్ష్మ దర్శినిలతోను కూడా చూడలేనంత చిన్న పరిమాణం కలవాడు. అతని శక్తిసామర్థ్యాలునూ అల్పమే. అయినప్పటికీ అతడు సుఖదుఃఖాల అనుభవాన్ని పొందుతాడు. స్వల్పజ్ఞానం కలిగి సుఖాలు పొందటానికి ప్రయత్నశీలుడై యుంటాడు. అదియునూ పరమేశ్వరుడు ఏదైనా శరీరాన్ని, యింద్రియాలను, మనస్సును నిర్మించి యిచ్చినప్పుడు మాత్రమే. మనమంతా అట్టి జీవులమే. మనమంతా ప్రస్తుతం మానవ శరీరంలో ఉన్నాము. కనుక ఈ విషయాలను ఆలోచించగలుగుతున్నాం, తెలుసుకోగలుగుతున్నాం. దుఃఖాలను దూరం చేసుకోవడానికీ అధికాధిక సుఖాలను పొందటానికీ నిరంతరం ప్రయత్నం చేస్తున్నాం. ఈ ప్రయత్నాల కంతటికీ బుద్ధి కారణంగా ఉంటుంది. అది మనం ఎంతగా వికసింపజేసుకుంటే అంతగా వికసిస్తుంది.

పూర్వ జన్మలలోని అనుభవాలవల్ల మన బుద్ధి సాత్త్విక, రాజసిక, తామసిక సంస్కారాలను కలిగి ఉంటుంది. ఎవరి బుద్ధిలో సాత్త్విక సంస్కారాలు ఎక్కువగా ఉంటాయో అది సాత్త్వికబుద్ధి, ఎవనిలో రాజసిక సంస్కారాలు అధికమో అది రాజసిక బుద్ధి, అట్లే తామసిక సంస్కారాలు కలిగిన బుద్ధి తామస బుద్ధి అంటారు. వీటిలో రజోగుణ, తమోగుణ సంస్కారాలు మనలో రాగద్వేషాలను కలిగించి మనను వక్రమార్గంలో పయనించుమని ప్రేరేపించి కష్టాలపాలు జేస్తాయి. సాత్త్విక సంస్కారాలు మనను మంచి పనులలో ప్రవర్తింపజేసి సుఖాన్ని, ఉన్నతిని కలిగిస్తాయి. అందుచే మనం మనలోని

రాజస తామస ప్రేరణలను అణచిపెడుతూ సాత్త్విక ప్రేరణలనే అనుసరించాలి. మన బుద్ధిని వికసింపజేసుకొని మనకు ఇహపర సుఖాలను కలిగించే స్వస్తి పథాన్ని అనుసరించాలి. బుద్ధి వికాసానికి తోడ్పడేవాటిలో ఈశ్వరీయ జ్ఞానమైన వేదం అన్నిటికన్న ఉత్తమంగాను, ఉన్నతంగాను ఉంటుంది.

పరమేశ్వరుడు మనకు జ్ఞానగ్రహణ సాధనమైన బుద్ధిని ప్రసాదించటమేకాక దానికి విషయంగా వేదాన్ని ఉపదేశించాడు. దానిలో మానవులు ఉన్నతిని పొందటానికి ఎన్నెన్నో సాధనలను, సాధనాలను తెలిపాడు. ఆ వేదమార్గాన్ని అనుసరించినవారు తప్పక ఉన్నతిని పొందుతారు. వేదం అందరికి సులభగ్రాహ్య మైన ప్రాకృతిక పదార్థాలను, జీవజాతులను ఉపమానంగా చూపుతూ అనేక రీతినీతుల నుపదేశిస్తుంది. ఉన్నతోన్నత శిఖరాల నధిరోహించటానికి మార్గాలను సూచిస్తుంది. స్వస్తిపథమేమిటో వివరిస్తుంది. శుభముల బడయుగోరేవారు సూర్యచంద్రుల ననుసరించమంటుంది.

వేదమేమంటుందంటే -

**స్వస్తి పన్థా మనుచరేమ సూర్యాచన్ద్రమసావివ ।**
**పునర్దదతాఘ్నతా జానతా సంగమేమహి ॥** ఋగ్వే (5-51-15)

"సూర్యచంద్రుల వలె మేము స్వస్తిపథము ననుసరింతుముగాక! మరల మరల ఒకరికొకరం ఇచ్చుకుంటూ- సహకరించుకుంటూ, ఒకరినొకరు హింసించుకోకుండా- ద్వేషించుకోకుండా, ఒకరినొకరం అర్థం చేసుకుంటూ స్నేహశీలమైన సామాజిక జీవనాన్ని గడుపుదుము గాక!" అని సంకల్పించుకోవాలంటుంది.

స్వస్తి పథము ప్రేమ, త్యాగముల సమ్మిళితము. వీటినే అహింస, దాన గుణములుగా చెప్పవచ్చును. ఈ మార్గమునందు పయనించువారు, దానశీలతతో, పరులను హింసింపని ప్రవృత్తితో ఇతరులను సరిగా అర్థము చేసుకొనగలరు. ఇలా సమ్యక్ జ్ఞానంతో సంఘటనాత్మక సామాజిక జీవనాన్ని గడపగలరు.

నేటి యుగం వైజ్ఞానిక యుగం. ఖగోళాన్ని గురించిన సామాన్య విషయాలు చిన్న తరగతులలోనే బోధిస్తున్నారు. ముఖ్యంగా మనమందరం భూమిని గురించిన, సూర్యచంద్రులను గురించిన సామాన్య జ్ఞానం కలిగియుండటం అవసరం. మనం నివసించే ఈ భూమి ఈ సూర్యకుటుంబములోని ఒక గోళం. అది తన చుట్టూ తాను తిరుగుచూ సూర్యుని చుట్టూ తిరుగుచున్నది. భూమి పడమట నుండి తూర్పుగా తనలో తాను తిరుగుచున్నందున సూర్యచంద్ర నక్షత్రాదులు తూర్పున ఉదయించి పడమట అస్తమిస్తున్నట్లు అనుభూతి కలుగుచున్నది. ఆకాశంలో మనకు కనిపిస్తున్న - కనిపించనివి కూడా స్థిరంగా లేవు. అన్నీ భూమి మాదిరిగానే తమ చుట్టూ తాము తిరుగుతూ వాటి కేంద్రములైన పెద్ద గోళముల చుట్టూ తిరుగుతున్నాయి. అట్లే మూలకాలలో (Elements)అతి చిన్న భాగమైన అణువులోనూ ఈ తిరిగే గతి ఉంది. అది నియంత్రిత గతిగ - నియమబద్ధంగా ఉంటుంది. దీనిని మన వేదం ఈ క్రింది విధంగా వర్ణిస్తుంది.

**ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్।** -యజు.(40-1)

దృష్టిగోచరమవుతున్న గతిశీలమైన ఈ సర్వము - ఈ విశ్వమంతా అణువు మొదలు బ్రహ్మాండముల వరకు ఈశునిలో - నియామకశక్తిచే వ్యాప్తమైయున్నది. ఈశుడే వాటిని నియమించి నడుపుచున్నాడు.

పై మంత్రంలో పేర్కొన్న సర్వవ్యాపక ఈశునే - నియామకశక్తినే వేదధర్మం దేవుడు అంటుంది. అట్టి దేవుడు ఒకే ఒక్కడు. అతనినే వేదం పలు నామములతో కీర్తిస్తుంది. ఆ నామములన్నీ ఈశ్వరుని వివిధ గుణగణాలను తెలిపేవే. అంటే అవన్నీ ఏకేశ్వరునికి విశేషణాలే. ఈ విషయాన్ని స్పష్టపరచటానికి వేదం- **ఏకం సద్విప్రా బహుధా వదన్తి అగ్నిం యమం మాతరిశ్వానమాహుః** - (ఋ 1-164-46) అని ఘోషిస్తుంది.

ఈ జగత్తంతా గతిశీలమై ఉంది. కనుకనే వేదం **'జగత్యాం జగత్'** అంటున్నది. ఆ గతి నియమబద్ధంగా ఉంది. ఆ నియమబద్ధతకు కారణం సర్వవ్యాపక సర్వేశ్వరుడు. ఆ సర్వేశ్వరుడు అల్పజ్ఞులైన మానవుల నుద్దేశించి ఓ మానవులారా! సూర్యచంద్రుల గతి ననుసరిస్తూ స్వస్తిపథమున పయనించమంటున్నాడు. కనుక వాటి గతిని గురించి ఆలోచిద్దాము.

ఈ విశాల విశ్వంలో మన సూర్యుడు ఒక చిన్న నక్షత్రం. నక్షత్రం అంటే తరుగని ప్రకాశం గలదని అర్థం. నక్షత్రం స్వయంగా ప్రకాశిస్తూ తనచుట్టూ తిరుగుచున్న గ్రహ ఉపగ్రహాలకు ప్రకాశాన్నిస్తూ ఉంటుంది. నక్షత్రాలు పెద్ద పెద్ద హైడ్రోజన్ వాయుగోళాలనీ, అందలి హైడ్రోజన్ హీలియం వాయువుగా పరిణామం చెందుచూ పెద్ద పెద్ద మంటలను కలిగిస్తున్నాయనీ, ఆ ఉష్ణ ప్రకాశాలే వాటిచుట్టూ తిరుగుచున్న గ్రహ ఉపగ్రహాదులకు అందుతున్నాయనీ ఖగోళ విజ్ఞానం చెబుతున్నది. భూమిపైనున్న మనకు సూర్యునివల్లనే ఉష్ణ ప్రకాశాలు లభిస్తున్నాయి. ఇంతేగాక, ప్రాణులలో కనబడే శక్తి (ఎనర్జీ)కి సూర్యుడే మూలాధారం.

వృక్షజాతులలో నున్న ఆకుపచ్చని రంగు (క్లోరోఫిల్) సూర్యకిరణాలను స్వీకరించి దానితో భూసారాన్ని, నీటినీ, గాలినీ సమ్మిళితం చేసి ఆహారాన్ని ఉత్పత్తి చేస్తుంది. ఆ ఆహారాన్ని తిని మనుష్య, పశు పక్ష్యాది జంగమ జాతులన్నీ శక్తిని పొందుతున్నాయి. మాంసాహార ప్రాణులు కూడా మరియొక శాకాహారి ప్రాణిని తింటున్నందువల్లనే శక్తిని పొంది జీవిస్తున్నాయి. కనుక శక్తి (ఎనర్జీ)కి మూలాధారం సూర్యుడే అంటారు శాస్త్రవేత్తలు.

నిరంతరం ఉష్ణ ప్రకాశాలను, తద్వారా శక్తిని ప్రదానం చేస్తున్న సూర్యుని దేవత అంటాయి మన వేదశాస్త్రాలు. దేవత కావటానికి దానగుణమే (దేవో దానాద్ వా) ప్రధానమైన గుణం- అర్హత. ఆ దానశీలత ప్రాణులలో ఉంటే వాటిని చేతన దేవతలనీ, జడ పదార్థాలలో ఉంటే జడ దేవతలనీ అంటారు. సూర్యుడు ఒక జడ దేవత. సూర్యునిలో జ్ఞానం లేకపోయినా నిరంతరం అది తపిస్తూ తన శక్తులను మనకు దానం చేస్తున్నది. తనను ఆశ్రయించి తన చుట్టూ ఉన్న గ్రహ ఉపగ్రహాలను మార్జాల కిశోర న్యాయంగా తన ఆకర్షణశక్తితో జాగ్రత్తగా పట్టుకుని తాను తన కేంద్రం చుట్టూ తిరుగుచున్నది. అది పయనించే పథం కూడా స్వస్తి పథమే - శుభంకరమార్గమే. కనుకనే సూర్యగమనం వందలకోట్ల సంవత్సరాల నుండి సాగుచున్నా యింతవరకు ఏ ప్రమాదం జరుగలేదు. అది మరే ఇతర సూర్య కుటుంబాలను హింసించలేదు. వాటి గమనానికి తాను అడ్డుగాకూ లేదు. పరమేశ్వరుడు తనకు నిర్ణయించిన మార్గంలో తాను జ్ఞానివలె నడుచుచున్నది.

కనుకనే వేదభగవానుడు సూర్యునివలె స్వస్తి పథమున నడువుమని ఉపదేశింస్తున్నాడు. ఇక చంద్రుని గురించి ఆలోచిద్దాము.

భూమి సూర్యుని చుట్టూ తిరుగుచున్నట్లే చంద్రుడు భూమిచుట్టూ తిరుగుచున్నాడు. అతడు అనుసరించేది కూడా స్వస్తి పథమే. సూర్యుని నుండి తాను పొందిన ప్రకాశాన్నంతా భూమికి దానం చేస్తున్నాడు. అందువల్ల భూమి మీదనున్న ప్రాణులన్నీ రాత్రులందు శీతలతను, ఆహ్లాదాన్ని పొందుతున్నాయి. కేవలం ప్రాణిజాతులేకాక జడ పదార్థమైన నీరును ఉల్లాసాన్ని పొందుతున్నది. చంద్రుని అందుకొన యత్నిస్తున్నది. ఇది మనకు విశాల నీటి స్రోతస్సయిన సముద్రంలో కనబడుతుంది. వెన్నెల యొక్క ప్రకాశం ఎంత ఎక్కువగా ఉంటే అంత ఎక్కువగా సముద్రపు అలలు ఉవ్వెత్తున లేస్తాయి. ఇట్టి దానగుణం కలిగి యుండటంవల్లనే చంద్రుని కూడా దేవతగా లెక్కిస్తాయి మన శాస్త్రాలు. ఇదియును ఒక జడ దేవతయే.

వేదం సూర్యచంద్రుల జననాన్ని గురించి ఆలంకారికంగా వర్ణిస్తుంది. "**చంద్రమా మనసో జాతః చక్షోః సూర్యోఽ అజాయత** - యజు. (31-12)" అంటుంది యజుర్వేదం.

ఈ విశ్వాన్ని ఒక పురుషునిగా, మానవ శరీరంగా కల్పన చేస్తే అంటే - విరాట్ పురుషునిగా భావిస్తే అట్టి విరాట్ పురుషుని మనస్సునుండి చంద్రుడు, కన్నులనుండి సూర్యుడు ఉద్భవించినట్లు కనబడుతుంది. సూర్యుడు వెలుగును ప్రసాదిస్తూ ప్రాణులకు నేత్రజ్యోతినిస్తున్నాడు. కనుక, అతడు విశ్వానికి నేత్ర సదృశుడు. చంద్రుడు చల్లదనాన్ని, ఉల్లాసాన్ని కలిగిస్తూ ప్రాణుల మనస్సులను పరవశింపజేస్తున్నాడు. కనుక, అతడు విశ్వానికి మధురమైన మనస్సు. ఇవి రెండూ జడ దేవతలు కనుక మాట్లాడలేవు. అయినా అవి మౌనంగా మనకు పెక్కు ఉపదేశాలనిస్తున్నాయి. మననశీలురే - ఆలోచనా పరులే వాటిని గ్రహించి స్వస్తిపథమేదో తెలుసుకోగలుగుతారు.

పై వేద మంత్రంలోని రెండవ పాదం మన ఆలోచనలకు ఆహారంగా - మార్గదర్శకంగా కొన్ని సూచనలను చేస్తున్నది.

"**పునః దదతా అఘ్నతా జానతా సంగమేమహి** ॥ అంటున్నది. అంటే-

సూర్యచంద్రులవలె మీరు కూడా మరల మరల దానశీలురవుతూ, పరస్పరం హింసించుకోకుండా, ఒకరినొకరు బాగా అర్థం చేసుకుంటూ ఐకమత్యంతో సామాజిక జీవనం గడుపమంటున్నది.

మానవుడు సామాజిక ప్రాణి. తోటివారి సహాయ సహకారాలు లేకుండా జీవితం సరిగా సాగదు. కనుక తోటివారితో కలిసి మెలిసి జీవించాలి. విభిన్న మనస్తత్వాలు, విభిన్న అభిప్రాయాలు, ఆశయాలు గల వ్యక్తులతో కలిసి మెలిసి జీవించటం కష్టమైన విషయమే. అయినప్పటికీ వేదం సూచిస్తున్న పై మార్గదర్శక సూత్రాల ననుసరిస్తే సంఘటనాత్మక జీవితం సాధ్యమే. తద్వారా సామాజిక ఉన్నతియును సాధ్యమే. కనుక ఉన్నతిని కలిగించే పై మూడు గుణాలను గురించి కొద్దిగా ఆలోచిద్దాము.

1. **దానశీలత:** మన వేదశాస్త్రాలు దానశీలతను గొప్పగా కీర్తిస్తాయి. దాన గుణమే మానవుని పుణ్యజీవిని చేసి స్వర్గాన్ని - సుఖమయ జన్మను ప్రసాదిస్తుంది. వేదాలలో దానాన్ని ప్రశంసించే మంత్రాలు వందలకొలది ఉన్నాయి. ఋగ్వేద దశమ మండలంలోని 112వ సూక్తం పూర్తిగా దాన ప్రశంసయే. దానశీలునకే దైవం ధనాన్ని పుష్కలంగా ప్రసాదిస్తుంది. (**ధాతా దదాతు దాశుషే**). ఏవిధంగా సూర్యచంద్రులు తమ ప్రకాశాన్ని, శక్తులను నిరంతరం ప్రాణులకు దానం చేస్తున్నాయో అట్లే మనం మన శక్తికొలది మన జ్ఞానాన్ని, శక్తులను తోటివారికి దానం చెయ్యాలి. అందించాలి. అప్పుడు మనం కూడా దేవతలమౌతాము. అప్పుడు ప్రజలు మనను ప్రేమిస్తారు, కీర్తిస్తారు. మనకు సహకరిస్తారు.

దానం అంటే కేవలం ధనాన్నే దానం చెయ్యమని కాదు. ధనం కలవాడు ధనాన్ని, విద్య కలవాడు విద్యనీ, శక్తి కలవాడు శక్తినీ - శ్రమను దానం చెయ్యవచ్చు. సామర్థ్యం కలవాడు భయభ్రాంతులతో కొట్టుకుపోతున్నవారికి జ్ఞానమార్గం చూపించి వారి బుద్ధిలో జ్ఞానజ్యోతిని వెలిగించవచ్చు. దానశీలతను మరొకమాటలో పరోపకారం అనవచ్చు. సకల శాస్త్రాల సారము - **'పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్'** అనేదే.

వాక్కుతోను, మనస్సుతోను కూడా మనం దానం చెయ్యవచ్చు. ఎట్లాంటే- ఎవరైనా తోటివారు రోగంతోగానీ, ఆపదతోగానీ పీడింపబడుతూవుంటే ధనరూపంలో మనం వారికి ఏమీ ఇవ్వలేకపోయినా మాటలతో సానుభూతిని ప్రకటించవచ్చు. ఆ రోగం బారినుండి, ఆ ఆపద బారినుండి తప్పించుకునే మార్గం - ఉపాయం చెప్పవచ్చు. అవీ చేయలేకుంటే కనీసం అతనికి స్వస్థత చేకూర్చుమని పరమేశ్వరుని ప్రార్థించవచ్చు. అందువల్ల మన మనస్సు ప్రసన్నమౌతుంది. ఒక రకమైన ఆనందానుభూతి కలుగుతుంది. ఆ ఆనందం మనలో అంతర్యామిగానున్న పరమేశ్వరునినుండి వస్తున్నదే.

కనుక దానశీలతతో - పరోపకారశీలతతో గడిపే జీవనయానం స్వస్తి పథమే.

**2. అఘ్నుతా:** అఘ్నుతా అంటే హింసించకుండా ఉండటం. ఇతరులకు మనం ఉపకారం చేయలేకపోయినా కనీసం అపకారం చేయకుండా ఉండాలి. వారిపై వైరభావం లేకుండా ఉండాలి. ప్రతిదినం మనం ఆత్మ నిరీక్షణం చేసుకుంటూ మనలో ఎవరిపైననైనా ద్వేషం ఉందేమోనని పరీక్షించుకోవాలి. ఉంటే దానిని పరమేశ్వరుని న్యాయరూప బాహువుల కంకితమివ్వాలి. ఎందుచేతనంటే - ద్వేషం మనలో హింసను ప్రేరేపిస్తుంది. మనస్సుతోనో వాక్కుతోనో కాయంతోనో (శరీరంతోనో) మనం ద్వేషించే వ్యక్తిని హింసిస్తాం. దానితో మనకు కొందరు శత్రువులు తయారౌతారు. జీవితం అశాంతితో భయంతో గడుపవలసి వస్తుంది. ఇంతేగాక, పరపీడనం పాపం కదా! కనుక నిత్యం ద్వేషాన్ని పోగొట్టుకునే ప్రయత్నం చేయాలి.

వైదిక సంధ్యావిధిలో **'ద్వేషత్యాగం'** అనేది ఒక అంగంగా - ప్రకరణంగా ఉంటుంది. మనకు నాలుగు దిక్కులా పైనా, క్రిందా అంతటా పరమేశ్వరుడు వ్యాపించి యున్నాడనీ, అతడు అనేక విధాలుగా మనను రక్షిస్తున్నాడనీ గుర్తు చేసుకోవాలి. దానితోపాటు ఈవిధంగా ద్వేషత్యాగం చెయ్యాలి.

**"యో అస్మాన్ ద్వేష్టి, యం వయం ద్విష్మః తం వో జంభే దధ్మః** - ఎవరు మమ్ము ద్వేషిస్తున్నారో, ఎవరిని మేము ద్వేషిస్తున్నామో అట్టి మే

మిరువురము మాలోని ద్వేషాన్ని నీ న్యాయరూప బాహువుల కర్పిస్తున్నాము. మేము పరస్పర ద్వేషరహితులమై మిత్రతతో సామాజిక జీవనము గడిపెదముగాక!" అని సంకల్పం చేసుకోవాలి. ఈ సంకల్పం దినానికి ఒకసారి మాత్రమే కాదు. ఉదయం 6 పర్యాయాలు, సాయంత్రం 6 పర్యాయాలు విధిగా చేసుకోవాలి. ఎందుకంటే- ద్వేషం మనలో ఏవైపునుండైనా చొరబడవచ్చు.

ద్వేషం పోతే మిగిలేది మిత్రతనే. మైత్రీ భావనతో గడిపే సామాజిక జీవనం మనను అన్నివిధాల ఉన్నతులను చేస్తుంది. నిర్భయులను చేస్తుంది. జీవితాన్ని ఆనందమయం చేస్తుంది. అట్టి జీవనయానమే స్వస్తిపథం.

**3. జానతా:** మానవుడు గడుపు సామాజిక జీవనంలో ఒకరినొకరు అర్థం చేసుకొనుట చాలా అవసరం. లేకున్న చాలా ఇబ్బందులేర్పడతాయి. స్వస్తి పథమున పయనించలేని విషమ పరిస్థితి ఏర్పడుతుంది. కౌటింబిక కలహాలకు సామాజిక కలహాలకు ప్రధాన కారణం ఒకరి దృష్టికోణాన్ని మరొకరు అర్థం చేసుకోకపోవటమే.

ఒక వ్యక్తి తెలియకకాని వ్యవహారజ్ఞానం లేకకానీ చిన్న పొరపాటు చేస్తే దానిని మరొక వ్యక్తి తప్పుగా భావించి కయ్యానికి కాలు దువ్వుతాడు. చిన్న తప్పిదాన్ని భూతద్దంలో చూపి పెద్దగా చేస్తాడు. దానితో యిద్దరిలోనూ అశాంతి మొదలౌతుంది. అట్లే, కొందరిలో ఒక వ్యక్తి ఆశయాలు అభిరుచులు మరొకవ్యక్తికి గిట్టవు. దానితో ఆ వ్యక్తిని ద్వేషించటం మొదలుపెడతాడు. క్రమంగా అది కయ్యానికి దారితీస్తుంది. కనుక (జానతా) యితరుల అభిప్రాయాలను అర్థం చేసుకోవడానికి యత్నించాలి. ఇంతేగాక, ఇతరుల అభిప్రాయాలను గౌరవించటం కూడా అవసరమే. లేకున్న స్వస్తి పథమున పయనించుట కష్టమే. వేదం ఈ విషయంలో 'అభిహర్యతను' కలిగి ఉండమంటుంది. అభిహర్యత అంటే ప్రేమపూర్వక వ్యవహారం. ఆ వ్యవహారం ఎట్లుండాలో వేదం ఒక చక్కటి ఉపమానంతో వివరిస్తుంది.

'**అన్యో అన్యమభిహర్యత వత్సం జాతమివాఘ్న్యా ॥**' అథర్వవేదం (3-30-1)

"ఓ మానవులారా! నవజాత వత్సమును గోమాత ప్రేమించునట్లు మీరు పరస్పరం వ్యవహరించం"డి అంటుంది.

వైయక్తికంగా కానీ సామాజికంగాగానీ రాష్ట్రీయకంగాగానీ మనం ఉన్నతి చెందాలంటే సంగఠన అనివార్యం. ఆ సంగఠనకు పరస్పర అవగాహన అత్యావశ్యకం. సంగఠనకు వేదం ఏమి ఉపదేశిస్తుందంటే -

**సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతామ్ ।**
**దేవా భాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే ॥**

-ఋ.(10.191.2)

"ఓ మానవులారా! మీరు కలిసి నడవండి. కలిసి ప్రేమతో వార్తాలాపములు చేయండి. కలిసి ఆలోచించండి. ఒకరినొకరు చక్కగా అర్థం చేసుకోండి. ఇతరుల అభిప్రాయాలను గౌరవించండి. పూర్వం దేవతలు (ఉత్తమ మానవులు) ఏరకంగా పరస్పరం కలిసి మెలిసి సామాజిక ఉన్నతికొరకు నిర్ణయాలు తీసుకున్నారో, వారి వారికి లభించిన ఉపభోగములతో సంతృప్తి చెందారో మీరును అట్లే వారిననుసరించి ఉన్నతిని పొందండి" అంటుంది.

కనుక సూర్యచంద్రులవలె ఎవరి ప్రగతికీ మనం అడ్డుకాకుండా మన ప్రగతికి మనం ప్రయత్నిస్తూ ఉంటే అదే స్వస్తి పథమౌతుంది. అది మనను మన లక్ష్యంవైపు నడిపిస్తుంది. అభ్యున్నతిని, ఆత్మోన్నతిని కలిగిస్తుంది. అందుకు దానశీలత, నిర్వైరత, అభిహర్యత (పరస్పర అన్యోన్యత) మనకు బాసటగా నిలుస్తాయి.

మరి, అలస్యమెందుకు ఇప్పటినుండి మనం వేదోపదేశాన్ననుసరించి సూర్యచంద్రులవలె స్వస్తి పథమున పయనింతము రండు.

ఓమ్ స్వస్తి

"వేదా నిహితా విశ్వరూపా"

# వేదాలు సర్వవిద్యా నిలయాలు, అమృత భాండాలు

ఓం యస్మాత్ పక్వాత్ అమృతం సంబభూవ
యో గాయత్ర్యా అధిపతిర్బభూవ ।
యస్మిన్ వేదాః నిహితా విశ్వరూపాః +
తేనౌదనేనాతి తరాణి మృత్యుమ్ ॥ - అథర్వవేదం 4-35-6

ఏ పరిపక్వతత్త్వంతో అమృతం (ఆత్మజ్ఞానం) పుట్టిందో దేనిలో గాయత్రీ మంత్రం ద్వారా ప్రతిపాదింపబడిన పరమేశ్వరతత్త్వం స్పష్టంగా ఉపదేశింపబడిందో అట్టి వేదాలు సమస్త విద్యానిలయాలు. ఆ మార్గంలో పయనించినవారే ఆత్మ పరమాత్మల సాక్షాత్కారాన్ని పొంది జననమరణరూప సంసార సాగరాన్ని తరించి అమృతత్వాన్ని - జన్మరాహిత్యాన్ని - అఖండ పరమానందాన్ని పొందుతారు.

అథర్వవేద 4వ కాండ 35వ సూక్తానికి ఓదన సూక్తని పేరు. 7 మంత్రాలుగల ఈ సూక్తమంతా "స్తేనౌదనేనాతి తరాణి మృత్యుమ్" అనే ధృతవాక్యంతో ముగుస్తుంది. 'ఓదనం' అంటే - అన్నమని సామాన్యార్థం. "వృద్ధిచేసేది, ఉన్నతిని కలిగించేది" అని మూలార్థం. అల్పజ్ఞులు, అల్పశక్తిమంతులునైన జీవుల ఉన్నతి కొరకే పరమేశ్వరుడు తన గొప్ప తపస్సుతో సృష్టి, స్థితి, ప్రళయాలు చేస్తున్నాడు. సృష్ట్యాదిలోనే వేదజ్ఞానాన్నిచ్చి సృష్టి రహస్యాలను, నియమాలను, ఉన్నతి మార్గాలను తెలిపాడు. కనుక ఈ సూక్తం దేవదేవుని 'ఓదనం' అనే పేరుతో పేర్కొంటుంది. "వేదా నిహితా విశ్వరూపా" అంటూ వేదాలు సర్వవిద్యా నిలయాలని తెలుపుతున్నది.

Published by:
**Gayatri Ashram Trust**
12-10-586/6, Vyas Vedic Kalyana Mandapam,
Medi Bavi, Seetaphalmandi (P.O.), Secunderabad-500061.
Cell: 92906 04641